# ఆంధ్రౌన్నత్యము

పండిత పెన్మత్స సత్యనారాయణరాజు

జయపుర సంస్థానాస్థాన కవి




ప్రకాశకులు

ది ఓరియఙ్ట్ పబ్లిషిఙ్ కంపెనీ (రిజిష్టర్డు)

మద్రాసు :: తెనాలి :: హైద్రాబాదు



1958

[వెల : రు. 0—87

# తొలి పలుకు

ఆంధ్రరాష్ట్రావతరణమునకై తన ప్రాణమును బలిదాన మిచ్చిన త్యాగమూర్తి శ్రీ పొట్టి శ్రీరాములుగారి జీవితచరిత్రమును, తదవతరణమున ఆంధ్రరాజ్య రథ సారథ్యము వహించిన ఆంధ్రకేసరి శ్రీటంగుటూరి ప్రకాశం పంతులుగారి జీవితచరిత్రమును, ఖండఖండాంతరముల ఖ్యాతిగాంచి భారతదేశమున మహోన్నతస్థాన మలంకరించిన శ్రీరాధాకృష్ణ పండితుని జీవితచరిత్రమును ఇందు బొందుపఱుపఁబడినవి.

ఇట్టి చరిత్రలు ప్రస్తుత విద్యార్థిలోకమున కెంతేని యాదర్శ ప్రాయములు కాగలవని నా విశ్వాసము.

ఈ చిన్నిపొత్తము పాఠశాలలయు, విద్యార్థిలోకము యొక్కయు ఆదరణమునకు పాత్రమగు గాఁక!

—గ్రంథకర్త

# విషయ సూచిక

## అమరజీవి - శ్రీ పొట్టి శ్రీరాములు

ఆంధ్రుఁడు వీరుఁడు. వీరజాతియైన యాంధ్రజాతి యతి ప్రాచీనమైనది. ఇది యుత్తరమునఁ గన్యాకుమారి మొదలు కొని దక్షిణమున మగధ వఱకును, దూర్పున బంగాళా ఖాతము దొరఁకొని పడమర బాదామి (వాతాపి) వఱకును అనంత సామ్రాజ్యమును స్థాపించి తన యఖండ విఖ్యాతిని దేశ దేశములలో వ్యాపింపఁ జేసినది.

ఆంధ్రులకనంతమైన చరిత్రయున్నది. దక్షిణ దేశము ననే గాక జావా, సుమిత్ర మొదలగు ద్వీపములలోఁ గూడఁ దెలుఁగు వెలుఁగులు ప్రకాశించు దేవాలయములు, కట్టడ ములు పెక్కులు గలవు. తిరుపతి, దక్షారామము, శ్రీ శైలము, కాళేశ్వరము మొదలగు దివ్యక్షేత్రములు కలవు. అజంతా, ఎల్లోరా, లేపాక్షి, అమరావతి మొదలగు కళా క్షేత్రములు గలవు.

విద్యారణ్య స్వాములవంటి వేదాంతులు, విద్యా నాథుఁడు-పండితరాయులువంటి సంస్కృతకవులు, విష్ణువర్ధ నుఁడు-పులకేశి- ప్రతాపరుద్రుఁడు, కృష్ణదేవరాయలు వంటి మహారాజులు, నన్నయ్య, శ్రీనాథ, పోతన, పెద్దనలవంటి తెలుఁగు కవులు, త్యాగరాజు, రామదాసు, అన్నమా

చార్యులవంటి మహాభక్తులు, విశ్వనాథ నాయకునివంటి సేనా
నాయకులు, విష్ణు సోమయాజి, యుగంధరుఁడు తిమ్మరుసుల
వంటి మహామంత్రులు, నాగార్జునునివంటి ఘనవైద్యులు, మల్లి
నాథునివంటి మహావ్యాఖ్యాతలు, వల్లభాచార్యునివంటి మత
స్థాపకులు; బాలచంద్రుఁడు, ఖడ్గతిక్కన తాండ్రపాపయల
వంటి వీరాధివీరులు రఘునాథరాయలు, ఆనంద గజపతుల
వంటి రసజ్ఞశేఖరులు, మొల్ల, వేంకమాంబలవంటి కవ
యిత్రులు మన తెనుఁగు గడ్డపై నెందఱో పుట్టి పెరిఁగి తమ
జన్మస్థానమున కపారసేవచేసి తమ జీవితములను చరితార్థము
గావించుకొనిరి. సామ్రాజ్యస్థాపకులైన యాంధ్రులు మధ్య
కాలములో తమ పూర్వవైభవమును గోలుపోయి పరదేశ
రాజులపాలనము లోఁబడి నిర్వీర్యులు నిస్తేజులునై పరుల
పెట్టుపోతలకుఁ జేతులు సాఁపవలసినవారైరి.

అన్నింటను దమదే పైచేయిగా బ్రతికిన యాంధ్రులు
క్రమముగా ఆంగ్లపరిపాలనములో అరవమేధావుల చేతిక్రిందఁ
బడి నలిగిపోవలసివచ్చినది. వారి దయా దాక్షిణ్యములకు
అఱ్ఱులు చాఁపవలసి వచ్చినది. వేయేల వారు పెట్టినదే భిక్షగా
రాజకీయరంగములో స్వీకరింపవలసి వచ్చినది. రాజకీయో
ద్యమములలో పెద్దపెద్ద పదవులన్నియు అరవ యుద్యోగులు
గుత్తగొన్నారు. విద్యావంతులైన యాంధ్రులకది సహింప
రాని సమస్యయైనది. ఆంధ్రులకుఁ బ్రత్యేక రాష్ట్రమేర్పడిన
గాని రాజకీయ సాంఘికాది విషయములలో అభివృద్ధి పొడ
సూపదని యనేక విషయములలో రుజువైనది.

భారత స్వాతంత్ర్యయుద్ధములో మడమత్రిప్పక ముం
దడుగు వేసి పోరాడిన యాంధ్ర జాతి తన ప్రత్యేక రాష్ట్ర

మునకై పెనగులాడలేదు. ఆంగ్లేయుల యడుగులకు మడుగు లొత్తలేదు.

కాని భాషాప్రయుక్తముగా రాష్ట్రములు నిర్మింపఁబడ వలయునను సమస్యను మాత్రము నాఁటి నాయకులు లేవఁ దీసిరి. మదరాసు రాష్ట్రమునుండి యాంధ్రప్రదేశమును విడఁ గొట్టి ప్రత్యేక రాష్ట్రమును నిర్మించుకొనవలయునని ప్రజలకుఁ బ్రబోధించిరి.

నాఁటి యాంధ్రదేశ నాయకులగు ఆంధ్రభీష్మ న్యాయ పతి సుబ్బారావు, దేశభక్త కొండా వేంకటప్పయ్య, దేశో ద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు, సర్ కూర్మా వేంకటరెడ్డి నాయఁడు, బొబ్బిలిరాజా, పానుగల్లు రాజా మున్నగువా రెందఱో ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకై ప్రచారము గావింపఁ దొడఁగిరి. ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకై నలుబదియేండ్ల పోరా టము సాగినది. ఆంధ్రమహాసభ స్థాపింపఁబడినది. 1908 వ సంవత్సరములో ప్రథమ వార్షికోత్సవము బాపట్లలో జరిగినది. దానికి సర్ బయ్యా నరసింహేశ్వర శర్మగా రధ్యక్షత వహిం చిరి. ఆ మహాసభలో ఆంధ్రులకుఁ బ్రత్యేకరాష్ట్రము కావ లయునని తీర్మానించిరి. ఆశయము సిద్ధింపలేదు. ఆంధ్రభీష్మ, దేశభక్తులతో పాటు డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు 1917 లో మీరట్‌లోనున్న బ్రిటిష్ ప్రభుత్వపు భారతదేశ కార్యదర్శియొద్దకు వెడలి యాంధ్రుల రాష్ట్రవాంఛను దెలియఁ జేసిరి. కాని ఫలితము పూజ్యమైనది.

ఆంధ్రులు నిరాశ చెందలేదు. దేశీయ మహాసభచే (కాంగ్రెస్) ఆంధ్రులకుఁ బ్రత్యేకరాష్ట్రము భాషాసిద్ధాంత

మునుబట్టి కావలయునని తీర్మానింపఁజేసిరి. తత్ఫలితముగా ఆంధ్ర, తమిళ కాంగ్రెస్సులు రెండు వెలసినవి.

1928 లో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారి తండ్రియగు మోతీలాల్ నెహ్రూగారి యాధ్యక్షమున జరిగిన రాజ్యాంగ సంఘమువారు భాషలను బట్టి భారతదేశములో రాష్ట్రము లేర్పడవలయునని యామోదించిరి. కాని యదియుఁ గార్య రూపమును దాల్చలేదు.

1931 లో ఇంగ్లాండునుండి సైమను కమీషను భారత దేశమునకు వచ్చినది. దానిని బహిష్కరింప వలయునని భారతదేశీయ మహాసభ యాదేశించినది. ఆ యాదేశమును శిరసావహించి యాంధ్ర నాయకులు సైమన్ కమీషనుకు స్వాగతమీయక నల్లజెండాలను జూపి, బహిష్కరించిరి. అదే సమయములో ఉత్కళులు సైమను సంఘమునకు స్వాగత మిచ్చి యుత్కళరాష్ట్రము నార్జించుకొనిరి. కాని యాంధ్రులు నిరాశాపూరితులు కాలేదు.

లండనులో జరిగిన రౌండ్ టేబుల్ మహాసభకు బొబ్బిలి రాజాగారు వెళ్ళి యాంధ్రరాష్ట్రమునకై యెంతేని కృషి చేసిరి. లాభము కలుగలేదు. తెల్లదొరల యుల్లములు పల్లవింపని కారణమున నా కృషియు వృథాయైనది. అంతమాత్రమునకు మన యాంధ్రనాయకులు నిరుత్సాహపడలేదు. 1935 లో భారత రాజ్యాంగశాసనము ఆచరణలోనికి వచ్చు సమయ మాసన్నమైనది.

సర్ కూర్మ రెడ్డినాయుడుగారు, వి. వి. గిరిగారి తండ్రి యగు జోగయ్యపంతులుగారు మున్నగువారు కలిసి యాంధ్ర రాష్ట్రమునకై రాయబారమునడప లండనునగరమునకు వెడలిరి.

దొరలకు ఆంధ్రుల చిరకాలవాంఛను దెలిపిరి. కాని యదియు వ్యర్థ ప్రయత్నమే యైనది. ధీరులగు నాంధ్రు లంతమాత్రమున నకు నిరుత్సాహపడలేదు. వెనుకంజవేయలేదు. చెన్నరాష్ట్ర శాసన సభలోను, కేంద్రశాసనసభలోను ఆంధ్రరాష్ట్రము నకై తీర్మానములు చేయుచు నాందోళనచేసిరి. 1937 తొలు దొల్త రాష్ట్రాధికారములను జేపట్టిన కాంగ్రెస్సు ప్రభుత్వము కూడ నాంధ్రులకుఁ బ్రత్యేకరాష్ట్రము ప్రసాదింపలేకపోయి నది. ఆంధ్రనాయకు లంతటితో విసుగుచెందక 1940 లో వార్ధాలోనున్న కాంగ్రెస్ అధిష్ఠానవర్గమునొద్దకుఁ బోయి యాంధ్రుల చిరకాల వాంఛను దెలియఁజేసిరి. వారును తూష్ణీ భావమును వహించిరి. కాని చేయూఁత నొసఁగలేదు. మన కోర్కె ఫలింపలేదు. మన నాయకులు నిస్పృహచెందలేదు. ఇంగ్లాండునుండి భారతదేశమునకు రాయబారిగా వచ్చిన క్రిప్సును దర్శించి మన రాష్ట్రవాంఛను నివేదించిరి. పిమ్మట సర్ బి. యన్. రావుగారు చెన్నరాష్ట్రమును రెండుగా విభజించవలెనని సూచించినారు.

1948 జూన్ 17 వ తేదీని భారతరాజ్యాంగ పరిషత్తు భాషారాష్ట్రముల నిర్మాణమునుగూర్చి తీర్మానించి ఆంధ్ర కర్ణాటక, కేరళ రాష్ట్రాల నిర్మాణసమస్యను బరిశీలించి నివేదిక యందఁజేయుమని శ్రీ ధార్ అను న్యాయాధికారిని నియమించి నది. శ్రీ పట్టాభి, శ్రీ ప్రకాశము, శ్రీ సాంబమూర్తి మొదలగు వారు శ్రీ ధారు నెదుట సాక్ష్యమిచ్చిరి. అది యాధారముగా శ్రీ జవహరిలాల్, శ్రీ వల్లభాయిపటేల్, శ్రీపట్టాభిగారలు కలసి జె. వి. పి. రిపోర్టుపేర ఆంధ్రుల హక్కులనుగూర్చి యొక నివే దిక వ్రాసి 'వివాదరహిత ప్రాంతములతో ఆంధ్రులకుఁ బ్రత్యేక

రాష్ట్రము నొసఁగవచ్చునని' తెలియఁజేసిరి. కాని యేమి లాభము! ఆంధ్రులదురదృష్టమో యదృష్టమోకాని రాష్ట్రము మాత్రము లభింపలేదు. ఈ విలంబనమును ఆంధ్రజాతి సహింపలేక పోయినది. 1951 ఆగష్టు 16 వ తేదీన స్వామి సీతారాం ముప్పదియారురోజులు రాష్ట్రసిద్ధికై యుపవాసదీక్ష సాగించెను. ఆంధ్రయువకులలో సంచలనము బయలుదేఱినది. ఆచార్య వినోబాభావే యడ్డుపడి శ్రీ సీతారాం ఉపవాసము మాన్పించి యాంధ్రుల రాష్ట్రవాంఛను నెహ్రూపండితునకు నెఱుఁగఁ జేసెను.

నవనీత హృదయుఁడగు నెహ్రూపండితుఁడు ఆంధ్రులందఱు నేకమై యొక్కత్రాటిపై నడచి మద్రాసుపట్టణముపై దమకుఁ గలదను హక్కు వదలుకొనిరేని రాష్ట్ర మిచ్చెదనని వాగ్దానము చేసెను. ఆంధ్రయువకు లాశా నిరాశలనడుమ నలిగిపోఁ జొచ్చిరి.

ఇది యిట్లుండ నీ మధ్యకాలములో తెలుఁగువారి కాణాచులగు కృష్ణాపినాకినీ నదీజలంబులను వీలైనచో గోదావరి జలంబునుగూడ తమిళదేశమునకుఁ గొనిపోవ మద్రాసు తమిళ మంత్రులు భగీరథ ప్రయత్నములుచేసిరి. పలుకుబడి యంతయు తమిళమంత్రులదే యగుట మన యాంధ్రమంత్రుల మాట యంతగా సాగలేదు. ప్రజలలో అలజడి యెక్కువైనది. సభలపై సభలుచేసి తీర్మానములపైఁ దీర్మానములుచేసి మన నదీజలంబులను తమిళదేశమునకుఁ గొనిపోవ వీలు లేదని గగ్గోలుచేసి కేంద్రమంత్రివర్గము నొద్దకు రాయబారము వెడలి తెలుఁగు ప్రజల సాధక బాధకములు, కష్టనిష్ఠురములు తెలియఁ బఱచిరి.

ఒక మూల నదీజలాలకై నాయకులు, ప్రజలు ప్రబలాందోళనసజేయుచుండ మఱొకవైపున యువకులైన విద్యావంతులు, విద్యార్థులు ఆంధ్రరాష్ట్ర మవతరించినఁ గాని యాంధ్రులకు మరి 'యెదురు బొదుగు' లుండవని యెలుఁగెత్తి చాటుచు ఆంధ్రోత్సవములు ప్రతి కళాశాలలోను, ప్రతి పాఠశాలలోను జరిపించుచు ఆంధ్ర సంస్కృతిని, ఆంధ్రౌన్నత్యమును గూర్చి, పండితులచేఁ గవులచే ఉపన్యాసము లిప్పింపఁ దొడఁగిరి. రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ, తుమ్మల సీతారామమూర్తి, పండిత సత్యనారాయణ రాజు మొదలగువారు పద్యములువ్రాసి యనేక సభలలోఁ జదివి ప్రత్యేకాంధ్రరాష్ట్రమునకై ప్రజలలో ఉత్సాహము రేకెత్తించిరి.

అనంత సామ్రాజ్య నిర్మాణదక్షులైన యాంధ్రులు పరరాజుల పాలనములోఁ గోలుపోయిన స్వరాష్ట్రమును, స్వరాజ్యము ప్రాప్తించిన తరువాతఁగూడ ఆర్జించుకొనలేక పోవుటకు ఆంధ్రజాతి యట్టుడికిన ట్లుడికిపోఁ జొచ్చినది.

సొంతరాష్ట్రము లేకపోవుటను ఆంధ్రజాతి తలవంపుగాఁ దలంచినది. స్వరాష్ట్ర హీనులకు భారతదేశములో ఉన్నపత్తురులు పుట్టవనియుఁ, బేరుప్రతిష్ఠ లుండవనియు నిశ్చయించుకున్నది.

ఈ క్లిష్టసమయములో ఆంధ్రజాతికిఁ గలిగిన నైరాశ్యమును బోఁగొట్టి, సముద్ధరించుటకు నొక యవతారపురుషుఁడు నడుముగట్టవలసిన తరుణ మాసన్నమైనది.

భారతదేశ దాస్యమును బాపి భారతీయులకు స్వరాజ్యము ప్రసాదించిన గాంధిమహాత్ముని ముఖ్యశిష్యుఁడు

శాంతిమూర్తి, సత్యాగ్రహి నాయకుఁడు నైన పొట్టి శ్రీరాములు ముందుకు వచ్చి నిలఁబడెను.

## శ్రీరాముల పుట్టుపూర్వోత్తరములు

శ్రీరాముల పూర్వుల నివాసగ్రామము నెల్లూరుజిల్లాలోని 'జువ్వలదిన్నె'. ఆ యూరి వైశ్యులలో కెల్ల వారే పూజ్యులు. వ్యాపారములలో మోసమెఱుంగని నిర్మల హృదయులు 'నిజాయతీపరులు'. ఆదినుండి శ్రీరాముల కుటుంబము వారు దురాశకుఁబోక పొదుపుగా సంసారము గడపుకొనుచు వచ్చిరి. కేవలము బేరసారములతోడనే కాలముపుచ్చక పరమార్థచింత కలవారై యతిథి, అభ్యాగతులకు నాదరపూర్వకముగా ఆతిధ్య మిచ్చుచుండెడివారు. తమ బిడ్డలకు పద్దులు వ్రాయు పాండిత్యమున్నఁజాలునని సంతృప్తి చెందక యాంగ్ల విద్యలుకూడ నేర్పించి పదిమందిలోఁ దలయెత్తుకొని తిరుగఁదగు పరువుప్రతిష్టలు గడించిరి. పల్లెటూరిలో వ్యాపారమునకు వృద్ధి కానరాకపోవుటయే కాక బిడ్డలకు విద్యాబుద్ధులు పెంపొందు సౌకర్యములుకూడ లేవని శ్రీరాముల తలిదండ్రులు మదరాసునకుఁ దరలిపోయి యచ్చట జార్జిటౌనులోని 'అన్నాపిళ్ళె' వీధిలో 163 నంబరుగల యింటిలో నివసించుచు వర్తకము చేసికొనుచుండిరి.

మన శ్రీరాములు 1901 వ సంవత్సరములో ఆ గృహమందే జన్మించెను. ఇరువది సంవత్సరముల వయసు వచ్చునందాఁక నందే యుండి యాంగ్లవిద్య నభ్యసించి, శానిటరీ యింజనీరింగు డిప్లమో పొంది జి. ఐ. పి రైల్వేలో నెలకు రెండువందల యేఁబది రూపాయల జీతము తీసికొనుచు నాలుగేండ్లపాటు తన యుద్యోగవిధులను సక్రమముగా నెరవేర్చెను.

నియమము తప్పి చరింపలేదు. లంచాలకుఁ జేయిచాఁపలేదు. నిరాడంబరముగా జీవితము గడఁపదొడఁగెను. అస్వాతంత్రత భారతదేశములోఁ బరదేశస్థుల క్రిందఁ బనిచేయుట కతని కెంత మాత్రము నిష్టములేదు. సమయ మాసన్నము కాఁగానే దేశసేవచేసి, భారతీయుల బానిసతనము బాప నువ్విళ్లూరు చుండెను. తన పనియేదో తనదేకాని, తలయెత్తి యెన్నఁడు ఒరులవంకఁ జూచెడివాఁడు కాఁడు. చేసెడిది యాంగ్లేయుల క్రింది ఉద్యోగమైనను ఎన్నఁడు విదేశవస్త్రములను గాని, వస్తువులనుగాని దాల్చి యెఱుఁగడు. అల్లారుముద్దుగా జూచు కొను వాని యిల్లాలు వయసులోనే యతనిని విడిచిపోయెను. అర్ధాంగి తన్ను బాసిపోయినందుల కాతఁడు విచారము చెంద లేదు. మరల వివాహము నాడలేదు. వృద్ధులైన తలిదండ్రులు తమ కొడుకు మరల నొక యింటివాఁడు కావలెనను తమ తలఁపును తనయున కెఱుకచేసిరి. కాని శ్రీరాములు వారికి సమాధానము చెప్పలేదు సరికదా పైపెచ్చు 'జననీ జనకు లారా! మరల నన్ను సంసారకూపములోఁ దింపకుఁడు. పర మేశ్వరుఁడు ఎందులకో నాకు స్వేచ్ఛ యిచ్చినాఁడు. ఇట్లే స్వచ్ఛందముగా నన్ను బ్రతుకనిండు. నాకు ఎప్పుడో యొక ప్పుడు నశించు నీ శరీరముమీఁద మమకారము లేదు. సబర్మతీ ఋషిపుంగవుని శిష్యుఁడనై యా మహాత్ముని సేవచేయఁ దలంచుచున్నాను. పూజ్యపాదుఁడైన గాంధిసేవ చేయుచు నా శాంతిదూత యాజ్ఞలను దలఁదాల్చి స్వదేశమునకు నా కాయ మర్పింపఁదలచినాను. కావున మీరు నా దారి కడ్డు రాకుడు. మీ మాటదాఁటు మూర్ఖునిగాఁ దలఁపకుండు. నన్ను ఆశీర్వదింపుఁడు.' అని వేఁడుకొనెను.

## శ్రీరాములు దేశసేవ

గాంధిమహాత్ముఁడు బ్రిటీషువారిపై అసహాయాస్త్రము ప్రయోగించి భూనభోంతరాళములు దద్దరిల్లఁ జేయుచుండెను. ఆసేతు హిమాచలపర్యంతము భారతదేశమంతయు 'జేగాంధి మహాత్మునకు జే' అను జయధ్వానములతో మాఱుమ్రోఁగు చున్నది. 'వద్దురా మనకొద్దురా పరపాలనంబిఁక వద్దురా, హద్దు పద్దులేని పన్నులరుద్ది పీల్చుచు నుండెరా, వద్దురా మన కొద్దురా పరపాలనంబిఁక వద్దురా' అను నినాదములు దిక్కులఁ బిక్కటిల్లుచుండెను.

1927 వ సంవత్సరములో అసహాయోద్యమము శ్రుతి మించి రాగమునఁ బడినది. విద్యార్థులు కళాశాలలుబహిష్క రించినారు. న్యాయవాదులు తమ వృత్తులు మానినారు. ఉద్యోగులు తమ నౌకరీలకు స్వస్తిచెప్పినారు. గ్రామ కరణ ములు, మునసబులుగూడఁ దమ పదవులను త్యజించి సహాయ నిరాకరణోద్యమములోజేరిరి. ప్రజ లాబాలగోపాలము విదేశ వస్త్రములను వస్తువులను బహిష్కరించుటయే కాక, వానిని దగులఁబెట్టసాగిరి. అసూర్యంపశ్యలగు కాంతామతల్లులు మండు టెండలలో నిలువఁబడి విదేశవస్త్రాలయములయొద్ద 'పికిటింగు చేయుచు తమ చీనిచీనాంబరములను అగ్నికాహుతి చేయు చుండిరి. రైతులు పన్నులుగూడఁ గట్టమని భీష్మించిరి.

ఆ మహోద్యమముయొక్క ప్రచండవేగమును గాంచి శ్రీరాములు ఉద్యోగమునకు నీళ్ళు వదలినాడు. తల్లిదండ్రు లకు మ్రొక్కినాఁడు. సోదరులను కౌఁగిలించుకున్నాఁడు. వారి యాశీర్వాదమును బొందినాఁడు. 'ఆస్తిపాస్తుల'ను విడిచి పుచ్చినాఁడు. గాంధిమహాత్మునికిఁ బ్రియశిష్యుఁడైనాడు. ఆయన

యడుగుజాడలలో నడువఁ జొచ్చినాఁడు. అహింసాతత్త్వము లోకక్షేమదీక్ష. రాట్న మొక్కటుండిన స్వరాజ్యము వచ్చు నని నమ్మినాఁడు. నియమబద్ధుఁడై రాట్నముపై నూలువడకుట, వస్త్రములు నేయుట, యనాథులసేవించుట గాంధి యాజ్ఞలను బాలించుట యతని దైనిక చర్యయై యున్నది.

మహాత్ముఁడగ్నిలో నుఱుకుమన్న నుఱుకుట, ఆజ్ఞాపించిన పనులుచేయుట, యావద్భారతదేశమున సంచారము చేసి యహింసాసిద్ధాంతమును అస్పృశ్యతా నివారణావశ్యకతను బ్రజలకు బోధించుటలు నాఁటి యాతనికార్యములు. 1927 నుండి 1938 వఱకు శ్రీరాములు మహాత్ముని చరణ సన్నిధినే యుండెను. సచ్ఛీలుఁడైన శ్రీరాములను గాంచి గాంధి యొకనాఁడు 'శ్రీరాముఁలూ! నీ వంటి యసహాయ యోధులు పదిమంది యున్నజాలు. పరరాజులను బాఱద్రోలి స్వారాజ్యమును జేపట్టుదు' నని మెచ్చుకొనెను.

ఉపన్యాసవేదికలపై కెక్కి లేని యావేశమును దెచ్చుకొని యొరుల మెఱమెప్పులకై శ్రీరాము లెన్నఁడు 'అవాకులు చెవాకులు' పలుకలేదు. నిష్కామ కర్మాచరణము, నిరాడంబర జీవనము, నిర్మాణాత్మకమైన కార్యక్రమము, వానికి నలంకారములైనవి.

స్వరాజ్యయుద్ధములో నతఁడు గుండెలుతీసిన బంటై యదరుగుండె, పిఱికికండ యెఱుఁగక ముందుకుఱికి పరప్రభుత్వమును గూలద్రోయుటలో మహాత్మునకు బాసటయై నిలిచి ముమ్మాఱు జైలునకేగి సెబాస్ ఆంధ్రవీరా! యనిపించుకొన్నాఁడు.

1938 లో వ్యక్తిగత సత్యాగ్రహోద్యమములోఁ బాల్గొని – మరల కారాగృహము నలంకరించి – గాంధికిఁ దగిన శిష్యుఁ డను మెప్పును గాంచినాఁడు. పిమ్మట నతనిని గాంధి మహాత్ముఁడు గుజరాతులోని 'తరవాడా' గ్రామ సేవాశ్రమ మునకు అధికారిగా నియమించి యచ్చటి కంపెను. అచ్చట శ్రీరాములు 'రెండున్నర' సంవత్సరములపా టుండి గాంధి సిద్ధాంతములను బ్రచారము చేసి, ప్రజల కపారసేవ చేసెను. ఘూర్జర దేశవాసు లతనిని అపరగాంధియని పిలువసాగిరి. పిమ్మట నతఁడు మాతృదేశమగు నాంధ్ర దేశమును సేవింపఁ దలపెట్టి, కృష్ణాజిల్లాలోని గుడివాడకు సమీపమున నున్న కొమరవోలు అనుగ్రామమునఁగల గాంధి ఆశ్రమములో నాలు గేండ్లపాటునివసించి ఖద్దరుద్యమము, అహింసావ్రత నియమ ములు,ప్రచారము చేయుచు నంటరాని తనమును రూపుమాప బద్ధకంకణుఁ డయ్యెను.

ఇంతలో గాంధిమహాత్ముఁడు 1942 సంవత్సరము ఆగష్టులో 'క్విట్ ఇండియా' యుద్యమము లేవదీసెను. ఆ మహోద్యమముప్రచండమై యావద్భారత దేశమును ఉఱ్ఱూఁత లూఁపివైచినది. మొలత్రాడు గట్టుకొనిన మగవాఁడెల్ల ఆ యుద్యమములోఁ బాల్గొనినాఁడు. అసహాయశూరుఁడగు మన శ్రీరాములు మాట వేఱ చెప్పవలయునా? 'ఇంతింతై వటుఁ డింతయై' యన్నట్లుగా నా మహోద్యమాగ్నిలో దూఁకినాఁడు. బ్రిటిషుగవర్నమెంటు దడ దడ లాడిపోయినది. వైస్రాయి వడ వడ వణఁకిపోయినాఁడు. శ్రీరాములను మరల బంధిఖానాలోఁ బెట్టినారు. ఇట్లు పలుమాఱులు స్వేచ్ఛకై, స్వరాజ్యప్రాప్తికై

జైళ్ళకేగి శ్రీరాములు నిజమైన దేశభక్తుడై స్వరాజ్యభిక్ష పెట్టినవారిలో నొక్కఁడై యుక్కు మిగిలినాఁడు.

స్వరాజ్యప్రాప్తియైన పిమ్మట శ్రీరాములు నెల్లూరు వెళ్ళి రాట్నమునుగూర్చి ప్రచారము చేసెను. (1943-44)

## హరిజన సేవ

అనాదికాలము నుండియు నాంధ్రభూభాగము నాశ్రయించి, యాంధ్రదేశపు భాగ్యభోగ్యములకుఁ గారణభూతులైన హరిజనులకు అందఱికిఁ గన్నతండ్రియగు శ్రీహరినిదర్శించి సేవించు హక్కు లేనందుల కా మహాభక్తుఁడు వగచినాఁడు.

కద్దరు పంచెను కటిని కట్టుకొని
కద్దరు కండువ పైని వేసికొని
కద్దరు సంచిని చేతపెట్టుకొని
కాళ్ళకు చెప్పులు లేకుండ
తలపై గొడుగది లేకుండ
కనులకు నిద్దుర లేకుండ
రాత్రియుఁ బగలును ఒక్కధాటిగా
తిరిగిన వీధిని తిరుగకుండఁగా
నడిచినదారిని నడువకుండఁగా
"దేవాలయముల లోపలికేగి
దేవుని పూజ చేసికొనంగ
హరిజనులకు హక్కియ్యండయ్యా!
ఆంధ్రులార మీరు"
అంచువ్రాసిన అట్టను మెడలో
ఉంచుక తిరిగాడు.

అట్లు తిరుగు శ్రీరాములనుగాంచి స్వార్థపరులెందఱో హేళనము చేసినారు. ఆ యికిలింపులు, సకిలింపులు, వెక్కిరింపులు స్థితప్రజ్ఞుడైన శ్రీరాములను జలింపఁజేయలేదు. రోజులు గడచినకొలది ప్రజలు మఱియు మొరటువాఱై హరిజనులు దేవాలయములలోఁ బ్రవేశించుటకు నియ్యకొనక కయ్యమునకుఁ గాలు ద్రవ్వసాగిరి. శ్రీరాములా యీ బెదిరింపులకు అదలింపులకు జంకువాఁడు కొంకువాఁడు కాఁడు! హనుమంతుని ముందఱనా కుప్పిగంతులు చూపుటలు? దౌర్జన్యవాదులయు, ఛాందసులయు హృదయములకుఁ బరివర్తనము గలిగింపఁగ ఘోర శపథము చేసి నిరాహారదీక్ష సాగించినాఁడు. అజ్ఞులతని విజ్ఞతను ఆత్మశుద్ధిని దెలియఁజాలక మొదట నవ్వసాగిరి. కాని నవ్విన యూళ్ళు పట్టణము లౌనని తెలియఁజాలరైరి. ఒకటి కాదు. రెండుగాదు. ఇరువదిమూఁడురోజు లుపవాసము చేసి భగవద్ధ్యాన నిమగ్నుఁడైనాఁడు. కఱకు మొఱకుల హృదయములు కదలి కరఁగినవి. పురము పెద్దలందరు నేకమై వచ్చి మోకరించి శ్రీరాములను దీక్ష విరమింప వేఁడిరి. హరిజనులు దేవాలయములలోఁ బ్రవేశించుట కంగీకరించిరి. శ్రీరాములు తన విజయమునకై విఱ్ఱవీఁగలేదు. గాంధిమహాత్ముని యాశీర్వాదమును బొంది హరిజనోద్ధరణమునకై ద్విగుణీకృతోత్సాహముతోఁ బాటుపడ సాగెను. ప్రభుత్వమువారు హరిజనుల యెడఁ బ్రత్యేక శ్రద్ధచూపకయు, వారి యాలనపాలన చేయకయు అలసులై యుండుట చూచి సహింపలేకపోయినాఁడు. ప్రభుత్వదృష్టిని హరిజనోద్ధరణమువైపునకుఁ ద్రిప్పుటకై మరల నుపవాస వ్రతమును వహించినాఁడు.

ఇరువదితొమ్మిదిరోజులు శుష్కోపవాసములు చేయు నప్పటికి మద్రాసుప్రభుత్వము కదలివచ్చి శ్రీరాములకాళ్లపైఁ బడినది. ఉపవాసము మానవలసినదిగా బ్రతిమాలినది. ప్రతి నెలలోను ఆమాసాంత దివసమున హరిజనరక్షణకై పాటు పడవలసినదిగా జిల్లాకలక్టరులకు ఆజ్ఞయొసఁగినది. శ్రీరాముల దీక్ష ఫలించినది. కృతకృత్యుఁడైనాఁడు. నాఁటినుండియు నా మహామహుఁడు నిర్మాణకార్యక్రమములో నిమగ్నుఁడై గాంధి స్మారకనిధిని సక్రమముగా వినియోగించుటకై ధర్మ కర్తయై మండల మండలమున సంచారముచేయుచు దేశసేవ చేయుచుండెను. సొంత రాష్ట్రమును సంపాదించుకొనలేక 'సతమత'మౌచున్న యాంధ్రజాతికి నేతయై యాంధ్రరాష్ట్ర మును సముపార్జింప దృఢనిశ్చయము చేసికొనినాఁడు. తాను పుట్టిపెరిఁగిన మద్రాసును చేరినాఁడు. తన గురుదేవుఁడైన గాంధిమహాత్మునకు మ్రొక్కుకొనినాఁడు. ఆత్మధ్యానమున మునిఁగి యాత్మను పునీతముచేసికొని యిట్లు ప్రకటించినాఁడు.

"స్వభావముచే నేను నిర్వహణకార్యక్రమకర్తను. ఈ జీవితమంతయు ఆ కార్యక్రమ నిర్మాణమునందే యింతవఱకు గడిపినాను. 1930 వ సంవత్సరము మొదలుకొని నేఁటివఱకు నేను గాంధిమహాత్ముఁడు తీర్చిదిద్దిన నిర్మాణ కార్యక్రమ మార్గములలో నడచుచుఁ బనిచేయుచున్నాను.

నానిర్మాణ కార్యక్రమములు, రాజకీయములు వేఱు వేఱు క్షేత్రములని చెప్పుటకు వీలులేదు. ఈ సత్యమును గ్రహించినవాఁడు గావుననే గాంధిమహాత్ముఁడు రాజకీయరంగ ములలోఁ బ్రవేశించి పనిచేసెను. రాజకీయరంగములలో విజయము గాంచెను. నిర్మాణ కార్యక్రమమును జేపట్టి

సాగించి దాని మూలముననే గాంధి మనకు స్వాతంత్ర్యము నొసఁగూర్చి స్వరాజ్యమును ప్రసాదించెను. నిర్మాణ కార్య క్రమ సాధనము చేఁబట్టి మహాత్ముఁడు రాజకీయములలోఁ దల దూర్చి యాకార్యక్రమముతోడనే "బ్రిటిషువారి"ని మన దేశమునుండి పాఱఁద్రోలెను. గతించిన రెండు సంవత్సరముల నుండి నేను ఆంధ్రదేశములో గాంధి స్మారకనిధికి 'సంచాల' కుఁడనుగాఁ బనిచేయుచున్నాను. 1948 వ సంవత్సరములో ఆంధ్రరాష్ట్రపు కాంగ్రెసు సంఘమువారి పక్షమున నిర్మాణ కార్యక్రమము 'అర్గనైజరు'గాఁ బనిచేసినాను.

ఈ నిర్మాణకార్యక్రమము నిర్వహించుటలో ఆంధ్రు లకుఁ బ్రత్యేకముగా రాష్ట్రము లేకపోవుటవలనఁ గలిగిన యిబ్బందులను కష్టాలను లెక్కింటిని నే ననుభవింపవలసి వచ్చి నది. ఆంధ్రులకుఁ బ్రత్యేకరాష్ట్రము లేకపోవుటచేత నెన్ని యిబ్బందులు కలుగుచున్నవో యప్పుడు నా కవగతమైనది. ఆంధ్రదేశములో నే చిన్నపని నెఱవేఱవలయు ననినను రాష్ట్రము లేనిచో నది జరుగదని నాకు నిశ్చయమైన యభిప్రాయము కలిగినది. దేశములో నేరాష్ట్రములోను బ్రభుత్వ విధానము పట్ల నిర్మాణకార్యకర్తలకుఁదృప్తియున్నట్లు కానుపించుట లేదు. ఆ విషయము నాకు బాగుగాఁ దెలియును. అయినను ఆ యా రాష్ట్రములలోఁ దా మెఱిఁగియున్న మనుష్యు లధికారము లలో నుండియున్నందుచేతను, నిర్మాణ కార్యక్రమము పట్ల ఆ యధికారులు సానుభూతి కలిగినవా రగుటచేతను ప్రభుత్వ విధానములు సరిగా లేకపోయినను నిర్మాణ కార్యక్రమ కార్య కర్తలు తమ తమ కార్యక్రమములు సక్రమముగా నిర్వహింప గలిగినారు. కాని మదరాసువంటి బహుభాషా రాష్ట్రాలలో

నిర్మాణ కార్యక్రమ కార్యకారుల గతి దిక్కుమాలిన దైనది. ముఖ్యముగా నాంధ్రదేశములో నిది 'అతిగతి' 'దారితెన్ను' లేనిదైనది. అందుచేత నేను నాసొంత బాధ్యతపైని రాజకీయములలో జోక్యము కలిగించుకొనక తప్పినది కాదు. నా యీ జోక్యము నిర్మాణాత్మకమైనది. మఱియు నిర్మాణకార్యక్రమ నిర్వాహణార్థమైనది యని నా నిశ్చితాభిప్రాయము.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణము నిమిత్త మెంతయో ప్రచారము ఆందోళనముగూడ జరిగినది. ఎన్నియో పరిశీలనలు జరిగినవి. నోటిలో నాలుకయున్న ప్రత్యాంధ్రుఁడు ఆంధ్ర రాష్ట్రావతరణమునకై యుత్సుకతను వహించియున్నాఁడు.

అయితే మద్రాసు నగరము ఆంధ్రులదా తమిళులదా యనునది యొక గడ్డు సమస్యయై యున్నది. మన ప్రధాన మంత్రివర్యులు పండిత నెహ్రూగారు మద్రాసునగరము విషయములో ఆంధ్రులు, తమిళులు ఏకమనస్కులై యేకసూత్రబద్ధులై యొక దారికి వచ్చినఁగాని యాంధ్ర రాష్ట్రమును విభజించు విషయమై తానెట్టి చర్యను దీసికొనఁ జాలనని ఘంటాపథముగాఁ జెప్పుచున్నారు. దీనినిబట్టి రాష్ట్రసమస్య మఱియు జటిలమును క్లిష్టమునునైన సమస్యయైనది కావున నీ రాష్ట్రోదంతమును గూర్చిన యాద్యంతములు మనమిప్పుడు తెలిసికొందము.

1916 లోఁ బ్రారంభమైన యాంధ్రోద్యమము ఫలితముగా నాంధ్రరాష్ట్ర నిర్మాణ వాంఛ యుద్భవించినది. ఈ వాంఛ కనుగుణముగ 1917 డిశంబరు నెలలో డాక్టరు అనిబిసెంటు అధ్యక్షతన కలకత్తాలో జరిగిన కాంగ్రెసుమహాసభలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘమును నిర్మించి

నారు. మద్రాసు కాంగ్రెసునకు మద్రాసు నగరముమీఁద నెంత అధికారమున్నదో యంత యధికారము ఆంధ్ర కాంగ్రెసునకుఁ గూడ నుండవలయునని యీ సభలో నొక తీర్మానముగూడ నంగీకరింపఁ బడినది.

క్రమముగా భాషాప్రయుక్త రాష్ట్ర విభజనోద్యమ మఖిలభారతీయ వాంఛగా, ఆశయముగా రూపొందినది. మహాత్మగాంధి నాయకత్వమున నీ వాంఛకు నొకరూపము మేర్పడినది. అది ప్రాతిపదికగా 1920 సంవత్సరములో నాగపూర్ కాంగ్రెసు మహాసభలో భారతదేశమంతయు భాషాప్రయుక్తముగా విభజింపఁబడి యే యేప్రదేశపు కాంగ్రెసు సంఘము లేర్పడినవి. 'ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు' సంఘము, 'తమిళనాఁడు కాంగ్రెసు' సంఘము, 'కర్ణాటక కాంగ్రెసు' సంఘము, 'కేరళకాంగ్రెసు' సంఘములన్నియు నప్పుడేర్పడినవే. నాఁడు ఆంధ్ర, తమిళ కాంగ్రెసు సంఘములు రెండింటికి మదరాసు నగరముమీఁద సమానాధికారము దత్తమైనది. ఈ రెండు రాష్ట్రసంఘములు తన తన కార్యాలయములను ఈ యధికార వ్యాప్తిగల ప్రదేశములలో నెచ్చటనైనఁ బెట్టుకోవచ్చునని భారత కాంగ్రెసు అనుమతించినది.

1926 సంవత్సరములో 'హారిః ఓ ' మ్మనుచు సర్ శంకర్‌నాయర్ తమిళరాష్ట్రనిర్మాణము కొఱకై నాఁటి కౌన్సిల్ ఆఫ్ స్టేట్సులో నొక తీర్మానము ప్రతిపాదించినాఁడు. సంపూర్ణ స్వయంపరిపాలనాధికారముతో నీ రాష్ట్రమేర్పడవలయునని యాతఁడు తెచ్చిన యీ తీర్మానము కోరినది. ఆ తీర్మానములో నిర్వచింపఁబడిన తమిళరాష్ట్రపు టెల్లలలో మదరాసు మాటయే లేదు. కాఁగా మదరాసు లేకుండగనే

తమిళరాష్ట్ర మేర్పాటు చేయవలయునని సర్ శంకర్ నాయర్ తీర్మానము కోరినది. అప్పుడు నాయ రిచ్చిన యుపన్యాసము కవున్సిల్ ఆఫ్ స్టేటు రిపోర్టులో 560 పేజీలోనున్నది. అందులో మదరాసు తమిళుల కెందులకు చెందదో యాతఁడు స్పష్టము చేసినాఁడు. మదరాసు తమిళనాఁడులో లేదు. మదరాసు తమిళు లది సగము ఆంధ్రులది సంగోరు అని యాతఁడు వక్కాణించినాఁడు.

పానుగల్లురాజా మదరాసు ముఖ్యమంత్రిగా నున్న కాలములో 'కూాము' నది సరిహద్దుగ మదరాసు పట్టణమును రెండుఖండములుగా విభాగించి యుత్తరభాగము నాంధ్రులకు దక్షిణ భాగము నరవలకు నీయవలయునని ప్రతిపాదనచేసినారు.

1927 సంవత్సరములో శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారు కవున్సిల్ ఆఫ్ స్టేట్‌లో ప్రత్యేకాంధ్రరాష్ట్రపు తీర్మానమును బ్రతిపాదించినారు. తెనుఁగుజిల్లా లన్నింటితో పాటు మదరాసు నగరపు టుత్తరభాగముగూడ నాంధ్రరాష్ట్రములోఁ జేరవలయునని వారి ప్రతిపాదన. (కవున్సిల్ ఆఫ్ స్టేటు చర్చలు 156 పేజి) కొండ వెంకటప్పయ్య పంతులుగారు మదరాసు నగరమంతయు నాంధ్రులదే యని సహేతుకముగా నిరూపించుచు 1949 సంవత్సరములో వారు దివంగతులగు వఱకు నాందోళన చేయుచునే వచ్చిరి.

1948 సంవత్సరములో జె. వి. పి. రిపోర్టు వచ్చినది. సత్వరాంధ్రరాష్ట్ర నిర్మాణమునకు మదరాసు నగరముమీఁద దమకుఁ గల హక్కుల నాంధ్రులు వదలుకొనవలె నని యా 'రిపోర్టు' వెల్లడించినది. దాని నాంధ్రులందఱు ప్రతిఘటించి

నారు. ఆంధ్రరాజధాని మదరాసే కావలయునని యెలుగెత్తి చాటినారు.

1950 సంవత్సరములో శ్రీ ప్రకాశము పంతులుగారు 'విప్రతిపత్తిలో' విభజన సంఘ నివేదిక ప్రకటింపఁబడినది. ఆ సంవత్సరమే జనవరి నెలలో నా సంఘము మదరాసు నగరముతోపాటు మఱియు ననేకేతర సమస్యలనుగూర్చి కూడఁ జర్చించినది. 1926 సంవత్సరములో మదరాసు నగరము తమది కాదనిన తమిళు లిప్పుడు సర్వస్వామ్యములతోడను మదరాసు నగరము తమదే యనుట యెంతమాత్రము న్యాయముగా లేదు. మదరాసు నగరమును కేంద్రప్రభుత్వము పాలన క్రింది ప్రత్యేక రాష్ట్రముగా నిర్మించుటకుఁ గూడఁ దమిళు లంగీకరించకపోవుట శోచనీయము.

రాయలసీమలోని ప్రజలు, నెల్లూరుజిల్లావారు గూడ ఆంధ్రరాష్ట్రమునకు మదరాసే రాజధానీనగరముగా నుండవలయునని కోరుచున్నారు. ఆంధ్ర, తమిళుల కా నగరమును బంచినను, లేక కేంధ్రప్రభుత్వ పాలితనగరముగ నిర్మించినను అది యాంధ్రరాజధానిగా నుండవలయు ననునదియే వారి తలంపు. ఆ ప్రజానీకముయొక్క యార్థికావసరము లన్నియు మద్రాసు మీఁదనె ఆధారపడియున్నవి.

నే నిప్పటికి నేఁబది సంవత్సరములనాఁడు మదరాసు నగరములోని జార్జిటౌనులోని అన్నాపిళ్లెవీధి 163 నెంబరుగల గృహములో జన్మించినాను. నా చదువుసంధ్య లన్నియు మదరాసులోనే పరిపూర్తిచేసినాను. నా యిరువది యేండ్ల ప్రాయము మదరాసులోనే గడచినది. 1934 సంవత్సరముదాక మా కుటుంబమువారు కూడ మదరాసులోనే నివసించినారు.

మదరాసు నగరముతోడి నా సంబంధ మిది. నగరములోని యాంధ్రుల కేమి, నెల్లూరు రాయలసీమ వాసుల కేమి మదరాసు నగరము నెడ మక్కువ మిక్కిలి యెక్కువయని నేనెఱుఁగని వాఁడనుగాను. తమంతటతామై వారు 'మదరాసు ఆంధ్ర రాజధాని కాదనిన' వాదమునరికట్టుటకై యెట్టిత్యాగమును జేయ సమకట్టి సాహసింపలేదు. మద్రాసునగరనిర్మాణమునకై యాంధ్రులుపడిన శ్రమ మనంతమైనది. దానం జేసి తమరాజ ధాని యచటనుండి మఱి 'పేరు నూరు' లేని యేదో యొక ప్రదేశమునకుఁదరలింపఁబడుటకు వారుసహింపరానిభరింపరాని విషయము. కావుననే యాంధ్రు లీ విషయమై సభలు, సమా వేశములు జరిపి మదరాసు రాజధానిగ నాంధ్రరాష్ట్రము నిర్మింపఁబడవలయునని తీర్మానములుచేసి తమ భావమును బూర్తిగా వెల్లడిచేసియున్నారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణమును గూర్చిన యుదంత మిది. కాంగ్రెసు అధ్యక్షులు, భారతదేశ ప్రధాన మంత్రులు నగు పండిత జవహరులాల్ గారు ఏలొకో మదరాసు నగరము నెడ నాంధ్రులకుఁ దమిళులకుఁగల వివాదమును బరిష్కరింప నిరాక రించినారు. ఆంధ్రులు తమిళులు తామె తమకుఁగల నగర వివాదమును బరిష్కరించుకొనవలయునని యాదేశించినారు. దానంజేసి వారికిష్టములేని కార్యమును వారు తమపైఁ బెట్టు కొన నంగీకరింపరైరి. కావున నీ విషయమును వారి దృష్టికి రాఁగల వాతావరణమును గల్పించి దేశక్షేమము నాకాం క్షించి యాంధ్రరాష్ట్ర నిర్మాణమునకుఁ బూనుకొను పరి స్థితులు కల్పింపవలసిన యవసర మాసన్నమైనది.

దీనినిసాధించుటకు రెండే మార్గము లున్నవి. మొదటిది హింసాయుతము, రెండవది యహింసాయుతము. అహింసా నిరతులైనవారు తమ కేమియుఁ బట్టన ట్లూరకొని నిద్రపోయి నచో హింసావాదులైనవారు పూనికతో ముందుకువచ్చి పరి ష్కార దుస్సాధ్యమైన పరిస్థితులు కల్పింపఁగలరు. స్వామి సీతారాం ఈ సమస్యనుగూర్చి ప్రజల మనస్సులు పెడదారిని బట్టకుండఁజేసిన ప్రయత్నము హర్షింపఁదగినది. వారిమార్గము నందఱు ననుసరించక పోవచ్చును కాని యీ మాటమాత్ర మంగీకరింపక తప్పదు.

ఇప్పుడు మద్రాసు నగర భవిష్యత్తును గూర్చి నిర్ణ యము విషయమై గట్టి ప్రయత్నము చేయవలసి యున్నది. ఇందులకు మద్రాసునగరమే యుచితక్షేత్రము. ఉచితజ్ఞులయిన యాంధ్ర తమిళు లనేక సూత్రబద్ధులను జేసి మదరాసుతో సంబంధమున్నవా రందఱిమధ్య సంతృప్తికరమైన యంగీకార మును గుదిర్చి యాంధ్రతమిళులకు నగరముపైఁగలహక్కులను బరిష్కరింపవలసియున్నది. మదరాసు నగరమును ఆంధ్ర తమిళుల సమష్టి యాస్తిగఁ జేసినచో సంతృప్తికరముగా నుండును. అది యెట్లు చేయుటయో నా పనికాదు — ప్రజలకే యది వదలివేయుచున్నాను.

అందులకై నేను నా యోచినంతలో నొక పనిచేయఁ దలపెట్టినాను. ఆమరణోపవాసదీక్ష వహించి యీ విషయ మును బ్రజలదృష్టికిఁ దేఁగలనను నాశ నాకుఁగలదు. అందుచే నేను 1952వ సంవత్సరము 19వ తేదినుండి 89 వీరభద్రన్ వీధిలోఁగల బులుసు సాంబమూర్తిగారి యింటిలో నీ బాధ్య తను నిర్వహింపఁ బూనినాను. మదరాసు నగరము విషయమై

ప్రజలలో నొక యొడఁబాటు కల్గినను రాజ్యాంగములోని శివ సెక్షనుననుసరించి భారతప్రభుత్వ మాంధ్రరాష్ట్ర నిర్మాణము నొనర్పఁ బూనుకొనినట్లు ప్రకటించినను జాలు. నేను దీక్షవిరమించెదను. లేనిచో దీక్ష యామరణాంతరము సాగించెదను" అని కఠోరశపథముచేసి ప్రాయోపవేశదీక్ష గైకొనెను.

ప్రా యో ప వే శ ము

అది 1952 సంవత్సరము 19 వ తేదీ యుదయము ఆరుగంటలవేళ. శ్రీ శ్రీరాములు సత్యాగ్రహదీక్షాదీక్షితుండై స్నానసంధ్యాదికములు గావించి, గాంధి యాశ్రమ గీతావళి పఠించి శుచియై భగవద్గీతాపారాయణము చేయుచు నుపవాసవ్రతియై శ్రీ బులుసు సాంబమూర్తిగారి గృహమునం దుపవిష్టుఁడయ్యెను. ఎర్నేని సుబ్రహ్మణ్య ప్రభృతి గాంధి శిష్యులు మహాభక్తు నాశీర్వదించినారు.

శుద్ధమైన కద్దరువస్త్రములు, అంటకత్తెర వేసిన తల, గుండ్రని నగుమోము గంభీరములై పవిత్రములై యాశాపూరితములై, నిర్మలములైన నేత్రములు, కురుచ యాకారము గలిగి యాంధ్రరాష్ట్రము నార్జించుటకై ప్రాణములుపణముగా నొడ్డిన యా మహాత్యాగి తపస్సునకు దేశము నలుచెఱఁగుల నుండి సానుభూతులు, వేఁడికోలులు, ప్రశంసలు వచ్చినవి. ఉపవాసవ్రతము విరమింపవలసినదిగాఁ బత్రికాధిపతులు, ఉపరాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణ, ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూ మొదలగు మహామహులు. పెక్కుమంది ప్రజాసభా సభ్యులు (M. p.) కూడఁ జేతులొగ్గి ప్రార్థించిరి.

తన యాశయము సిద్ధించువఱకుఁ దాను దనవ్రతనియమమును వదలఁజాలనని యా వజ్రసంకల్పుఁడు నిష్కర్షగాఁ

ప్రకటించెను. 'యశోవామృత్యుర్వా' యనియాభీష్ముఁడు స్వీయ రాష్ట్రమునకై స్వచ్ఛంద మరణముచెంద నిశ్చయించుకొని నాఁడు. 'తపములే దుపవాసవ్రతంబుకంటె'నని చాటినాఁడు. తెల్లవారుచున్నది. ప్రొద్దుగ్రుంకుచున్నది. కాలము గడిచిపోవు చున్నది. ఆంధ్రదేశము నలుమూలలనుండి హాహాకారములు చెలరేఁగఁజొచ్చెను. ఏయింటఁ జూచినను నేవీధిఁ గాంచినను నేబడి తిలకించినను, నే రైలులోఁ బయనించినను, నే బస్సులో నేగినను శ్రీరాములు యుపవాసదీక్షను గూర్చిన ప్రసంగములే సాగుచున్నవి.

ఉపవాసవ్రత మారంభించి యేఁబది దినములు గడచి పోయినవి. డాక్టరు శ్యామప్రసాదు ముఖర్జీవంటి మహామహులు శ్రీరాముల యెడఁ జూపుచున్న ప్రభుత్వ నిర్లక్ష్యవైఖరిని నిశితముగా విమర్శించిరి. ప్రభుత్వదృష్టిని విడిచి నెహ్రూ పండి తుఁడు దయార్ద్రహృదయుఁడై నిరశనవ్రతము మానవలసి నదిగాఁ జేసిన ప్రకటనను శ్రీరాముల కర్ణపుటములలోఁ జెంతనున్నవా రూఁదిరి. కొనయూపిరితో నున్న శ్రీరాములు ముక్కుపై వ్రేలువైచుకొని 'అబ్బా యెంతటిమాట! రాష్ట్ర సిద్ధి లేక నేను వ్రతభంగము కావింతునా! కావింప'నని భగవద్ధ్యాన నిమగ్నుఁడయ్యెను. ప్రాయోపవేశ మారంభించి నాఁటికేఁబదియేడు రోజులు గడచినవి. అది యేఁబదియెనిమి దవ రోజు. డిశంబరు 15 వ తేది రాత్రి పదునొకండుగంటల యిరువదిమూఁడు నిమిషములైనది. బులుసు సాంబమూర్తి శ్రీరాముల సోదరుఁడు రంగయ్య, మేనల్లుడు, యన్. ఆర్. గుప్త, శ్రీ మోతే నారాయణరావు, ఎర్నేని సుబ్రహ్మణ్యము మొదలగువారు శ్రీరాములచెంత చింతాక్రాంత మనస్కులై కూర్చుండియుండిరి.

తుదిగడియలు సమీపించినవి. శ్రీరాములకు స్పృహ తప్పినది. మేనల్లుఁడుగు ప్త 'మామా! మంచినీళ్ళు త్రాగ దరా!' యని యడిగినాఁడు. 'త్రాగెదను' అన్నాఁడు శ్రీరాములు. ఎనిమిదియౌన్సుల నీళ్ళు కొబ్బరినీళ్ళు తేనెతోఁ గలిపి యిచ్చినారు- గుటక వేయలేదు. ప్రకృతి వైద్యులు కృష్ణంరాజుగారు కటిస్నానము చేయించినారు. పిమ్మటఁ గొంచెము సేపు యోగనిద్రాముద్రితుఁ డయ్యెను. రాత్రి 7-15 ని. లకు ఉచ్ఛ్వాస నిశ్వాసముల గతి మందగించినది. ఎనిమిదిగంటల ముప్పది నిమిషములయినది. హృదయ స్పందము తగ్గిపోయినది. సుబ్రహ్మణ్యము మున్నగు గాంధిశిష్యులు రామనామ స్మరణము చేయుచు 'రఘుపతి రాఘవ రాజారాం' అనియు 'హరేరామ హరేరామ రామరామ హరేహరే' యనియు రామ నామోచ్చారణము చేయుచుండిరి. రాత్రి పదునొకండు గంటల యిరువదిమూఁడు నిమిషములైనది. ప్రకృతి శాంతి వహించినది. పంచభూతములు రెప్పపాటుకాలము తమ విధులను గట్టిపెట్టి రామనామము జపించినవి. శ్రీరామనిర్యాణము జరిగిపోయినది. తారాపథముపై నొక దివ్యతేజస్సు దేదీప్యమైన వెలుఁగు చూపినది. ఆకాశవాణులు శ్రీరాముల నిర్యాణ వార్తను ప్రసారించినవి. ఆవార్త వినుటతోడనే భూమి వడఁకినది. కొండలు బెండులు వాఱినవి. నదులు, సముద్రములు నల్లకల్లోలము లైనవి. పక్షులు, విషాదగీతములు పాడినవి. మృగములు వికృతిగా నఱచినవి. యావదాంధ్ర దేశమున నే గేస్తురాలును ప్రొయ్యి రాఁజఁజేయలేదు. చంటిబిడ్డలకుఁ బాలీయలేదు. సనాగరికుఁడు కాఫీ త్రాగలేదు. కళాశాలలు తెఱవఁబడలేదు. పాఠశాలలు మూయఁబడినవి. ప్రజ లుద్రిక్తులైనారు. యావదాంధ్ర దేశమునను రైలుమార్గ

ములు మంత్రించినట్లు మాయమైనవి. రైళ్ళు, బస్సులు రాక పోకలు లేక యాఁగిపోయినవి. తెలుఁగు దేశము నాలుగు చెఱఁగులను గటికిచీఁకటి యలముకొన్నది. ఒక యూరికి మఱొక యూరితోఁ గల సంబంధము పూర్తిగాఁ దెగిపోయి నది. ఆవేశపూరితులై ప్రజ లరాజకృత్యములకుఁ దిగిరి. ప్రభుత్వ కార్యాలయములను, సొత్తులను, రైల్వేస్టేషనులను పాడుచేసిరి. ప్రభుత్వమువా రెంతగాఁ బ్రయత్నించినను బ్రజల నదుపులోఁ బెట్టుటకు రెండు మూఁడు రోజులు పట్టినది.

## మహాప్రస్థానము

మదరాసులోని సాంబమూర్తిగారి యింటియెదుట వీధిలో నొక వేదిక యమర్పఁబడెను. ఆ వేదికపై శ్రీరాముల భౌతికదేహము గంధపుష్పాక్షతలమధ్య నుంచఁబడెను. పద్మాసన స్థలమైయున్న యీ భౌతికదేహమునొద్ద ఎర్నేని సుబ్రహ్మణ్యము శ్రీరామదేశికుఁడు గీతాపారాయణము చేయుచుండిరి. మద్రాసు నగరములోని నానాదేశస్థులమధ్య భేదభావము లంతరించినవి. అద్వైతభావ మంకురించినది. ఆంధ్ర, అరవ, గుజరాతి, మార్వాడి, బెంగాలి, ఉరియా, బేహారి, మరాట, యను మాటయే మఱచిపోయిరి. ఆఁడుది, మగవాఁడు, పిల్లవాఁడు, పెద్దవాఁడు, కుంటి, గ్రుడ్డి, వారు వీరననేల యశేష జనము నదీప్రవాహమువలెఁ దెల్లవారుజామునుండి శ్రీరాములను గడసారి చూచిపోవుటకు రాఁదొడఁగిరి. ప్రతివారు ఆశ్చర్య విషాదపూరిత దృక్కులతో శ్రీరాముల దర్శించి, పాదములు తాఁకి మ్రొక్కి పూవులచేఁ బూజించిరి. మంత్రులు శాసన సభ్యులు శ్రీరాముల చరణకమలములయొద్ద వినమ్రులై నిలిచి మ్రొక్కిరి. శ్రీరామగుణ సంకీర్తనముతో మదరాసుపురము

శ్రీరామనిర్యాణమునాఁటి యయోధ్యానగరమును దలపించు చుండెను. ప్రజలు ఆఁకలిదప్పికలు మఱచినారు. నీళ్ళు నిప్పులు విడిచినారు.

ఇరువదవ తేది పగలు రెండుగంటల ముప్పది నిమిషము లకు శ్రీరాముల భౌతికదేహ మొక రెండెడ్లబండిపై నమర్పఁ బడిన కుర్చీపై నుంచబడెను. ఆశకటముమీఁద బులుసు సాంబ మూర్తి, ఎర్నేని సుబ్రహ్మణ్యము, స్వామిశీతారాం, ఎం.ఆర్. గుప్త, పొట్టి రంగయ్యగుప్త, టంగుటూరి ప్రకాశముగార లుపవిష్టులైరి. శకటము శ్రీరాముల జన్మగృహమున్న అన్నా పిళ్ళేవీధి మీఁదుగా చూళై శ్మశానవాటికకు సాగిపోవు చుండెను. సూర్యకుమారి, ఘంటసాల వెంకటేశ్వరరావు, మోపట్లుదాసు మొదలగు నటీనటు లమరగానముచేయుచు నమరజీవియగు శ్రీరాముల శకటమువెంట నడచిపోవుచుండిరి. ఇసుకవేసిన రాలకుండ జన సమూహాము పట్టణములోని యంగళ్ళన్నియు మూయఁబడినవి. రక్షకభటు లప్రమత్తులై నగర రక్షణము నిర్నిద్ర జాగరూకతతోఁ గావించుచుండిరి. పౌరనారీమణులు నీరాజనములెత్తి పుష్పవృష్టి కురియఁగా శకటము చూళై శ్మశాన వాటిక చేరినది. అంతకు మున్నే చేర్పఁబడియున్న చితిపై శ్రీరాముల పవిత్రభౌతిక దేహముంచ బఁడెను. శ్రీరాముల సోదరుఁ డగ్ని సంస్కారముచేసెను. అగ్నిభట్టారకుఁడు ప్రేమ పూర్వకముగా శ్రీరాములను గాఢా లింగనము గావించుకొని తన కడుపునఁ బెట్టుకొని యాదరిం చెను. ప్రజానీకము అశ్రుపూరిత నేత్రములతో గృహాభి ముఖమై వెడలిపోయెను.

సూర్యభగవానుఁడా విషాదగాథను జూడఁ జాలక పడమటి తెరచాటున కేఁగెను.

'ప్రకృతిదేవత ఓం శాంతిశ్శాంతి శ్శాంతిః' అని పఠించెను.

## ఆంధ్ర రాష్ట్రోదయము

డిశంబరు 16 వ తేదిని శ్రీరాము నిర్యాణముతో ఢిల్లీ పార్లమెంటు భవనములోని ప్రజామండలి సభ్యులు చకితులైరి. ప్రజాసభ ప్రారంభమయ్యెను. నెహ్రూ పండితుని మనసు వెన్నవలెఁ గరఁగిపోయినది. ముఖమండల మంతటను విషాద చ్ఛాయ లావరించినవి. కంఠము గాద్గదికము వహించినది. లేచి నిలిచినాఁడు. మహావేదాంతియు, నాంధ్రుఁడును నగు శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణుని ద్వారమున పార్లమెంటువారి సంతాప, సానుభూతులు శ్రీరాముల కుటుంబము వారికిని, ఆంధ్రులకును నందజేయించుటయేగాక, పందొమ్మిది వందల యేఁబదిమూఁడవ సంవత్సరము అక్టోబరు మొదటి తేదీనుండి ప్రత్యేకాంధ్రరాష్ట్ర మేర్పరుపఁబడునని ప్రకటింపఁజేసి యశ్రు తర్పణము చేసెను. ఆంధ్రప్రజ హర్షించినది. శ్రీ నెహ్రూపండితుని అగ్గించినది. శ్రీరాముని యాత్మ శాంతించినది. అతఁ డమృతమూర్తి యయ్యెను.

## ఆంధ్రరాష్ట్రోత్సవము

శ్రీశైలము కర్నూలు మండలములోనిది. కాళేశ్వరము, నిజామురాష్ట్రములోని తెలంగాణాలో నెలగందల మండలములో గోదావరినదితో ఇంద్రావతి సంగమించుచోట మాథని యను గ్రామమునొద్ద నున్నది. దక్షారామము (ద్రాక్షారామము) తూర్పుగోదావరి జిల్లాలోఁగలదు. శ్రీశైల

మున శ్రీ మల్లికార్జున స్వామి, కాళేశ్వరమునఁ గాళహస్తీశ్వరుఁడు దక్షారామమున భీమేశ్వరుఁడు లింగాకారములతో వెలసియున్నారు. శ్రీశైలము చెంతనుండి గుణభద్రయగు తుంగభద్రానది ప్రవహించుచుండెను. కాళేశ్వరము పొంతనే గోదావరి పాఱుచున్నది. దక్షారామముఃనొద్ద సప్త గోదావరము గలదు. ఈ మూఁడు పుణ్యస్థలములయందుఁ ద్రిలింగములు గలవు. ఈ త్రిలింగముల మధ్యస్థమైనదే తెలుఁగు దేశము. 'అ'కారశబ్దమునకు ఈశ్వరుఁడనియు నర్థమున్నది. ఈశ్వరుని అనఁగాఁ ద్రిలింగ స్వరూపుని ధరించినదగుటచేఁ ద్రిలింగ దేశమన్నను సమానార్థకమే.

త్రిలింగములలో నొకటైన శ్రీశైలము మహా పవిత్రమైనది. 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' శ్రీశైల శిఖరమును గాంచినవాఁడు మరల జన్మింపఁడు. భగవంతునిలో లీన మొందునని పురాణవచనము. ఆ శ్రీగిరి చరణమును స్పృశించి పునీతమై తుంగభద్రానది యొయ్యారిక త్రైవలె పాఱివచ్చి కర్నూలు పట్టణమును కౌగలించుకొనుచున్నది.

1953 సెప్టెంబరు ముప్పదియవ తేదీవఱకుఁ గర్నూలు జిల్లా కేంద్రము మాత్రమే. అక్టోబరు మొదటి తేదీనుండి యది యావదాంధ్ర రాష్ట్రమునకుఁ దాత్కాలిక రాజధాని. ఆంధ్ర దేశములోని యధికసంఖ్యాకులగు శాసనసభ్యులు కర్నూలు తాత్కాలిక రాజధాని యని నిర్ణయించుటచే నచ్చటనే రాష్ట్రావతరణ మహోత్సవములు నెఱపఁ బడినవి. ఆంధ్ర రాష్ట్రమునకు మొట్టమొదటి గవర్నరుగా నియమింపఁబడిన శ్రీ చందూలాల్ త్రివేది కర్నూలు నగరమంతయుఁ బట కుటీరములచే వెలుఁగొందఁ జేయించెను. కర్నూలంతయు శ్రీరామ

పట్టాభిషేకమునాఁటి యయోధ్యానగరమును దలపించుచు సకలాలంకార సంశోభిత మయ్యెను.

అక్టోబరు మొదటితేది యరుదెంచినది. తుంగభద్రా నదీతరంగములపై నుండి మందమారుతములు ప్రసన్నములై దుమ్ము దుమారములు లేనివై మెల్ల మెల్లగా వీవఁదొడంగెను. తూర్పున లోక బాంధవుఁ డుదయించెను. భానుకిరణవారములు నాఁటి గురువారమునగురుభావశోభితములై ప్రకాశింపఁ జొచ్చెను. ఎక్కడ జూచిన ప్రజలె, ఎక్కడ గనినను బుణ్యాంగనలె. ఎక్కడఁ గాంచిన సింగారించుకొనిన యువతీ యువకులె. ఎక్కడ వీక్షించిన విద్యార్థినీవిద్యార్థులె. ఎక్కడ వీక్షించిన నుద్యోగి బృందంబులె. ఎక్కడఁబొడగనినను శాసన సభ్యులె. ఎక్కడఁ దిలకించిన మేనుబులకించు మంగళవాద్యములె. ఎక్కడ దర్శించినను యోధాగ్రేసరుల బరాబరులె. ఒకమూల నశ్వశకటములు, ఒకప్రక్క కారులు, ఒకచక్కి బస్సులు, ఒకవైపున నాటుబండ్లు, ఒకపార్శ్వమున పల్లకీలు ఒక భాగమున లాలకీలు. ఇవియవి యననేల సమస్త వాహనములు కర్నూలు నలంకరించినవి. రంగురంగుల విద్యుద్దీపము లహోరాత్రములు దేదీప్యమానములై వెలిఁగినవి. దేవాయతనములలో నభిషేకాదు లొనర్పఁబడినవి. ప్రాచీనాంధ్ర వైభవచిహ్నమును అమరావతీ స్తూపాంచితమునునైన పూర్ణకుంభ విరాజితమైన యాంధ్ర ప్రభుత్వముద్ర ముద్రితమైన త్రివర్ణపతాకము నేలయీనినట్లు నిండియున్న ప్రజాసమూహము జయజయధ్వానములు చేయుచుండ, భారత ప్రధానియగు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూచే నెగుర వేయఁబడి రెపరెప లాడుచుండెను. రెండు వేల సంవత్సర

ములుగాఁగల తమ యాంధ్రపౌరుషము నేఁటికిఁ గదా మరల రేకెత్తినదని సభాంగణము నలంకరించిన సకలాంధ్రలోకము నిర్భరానంద వివశమై యానందబాష్పములు వెల్లివిరియ శరీరము లుప్పొంగ లోమ్ములువిఱిచి చేతులు చఱచి కరతాళ ధ్వనులు కావించిరి. వెంటనే నెహ్రూపండితుండు వేదిక నలంకరించి సింహాసనాసీనుఁ డయ్యె. నెహ్రూ కెదురుగా మహోన్నత వేదికపై నమరజీవియగు పొట్టి శ్రీరాములు నిర్మలస్ఫటికాకృతితోఁ దన యమరత్వాదర్శమును జాటుచు నెహ్రూపై నమృతదృక్కులు పఱపుచుండెను. నెహ్రూ శ్రీరాముల త్యాగనిరతికి జోహారు లొనర్చెను. ప్రజలు గాద్గదిక స్వరముల జేజేలు పెట్టిరి.

మహాసభ ప్రారంభమయ్యెను. నెహ్రూపండితునిదక్షిణ భూభాగమున ఆంధ్రదేశపు గవర్నరగు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదియు, ఉపరాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణయు, భారతదేశ కార్మిక మంత్రి వరాహగిరి వేంకటగిరియు ఆంధ్ర ముఖ్యమంత్రి టంగుటూరి ప్రకాశము, ఆంధ్రప్రదేశ కాంగ్రెసు అధ్యక్షుడును, ఉపముఖ్యమంత్రియునగు నీలం సంజీవరెడ్డియు, హైదరాబాదు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణరావును, వామపార్శ్వంబున భారతదేశ వ్యవహార మంత్రి కట్జూ, మదరాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచార్యులును మున్నగువా రుచితాసనములపై నుపవిష్టులై యుండిరి. అంతటఁ బ్రజలు జయ జయ ధ్వనులు గావించుచుండఁగా నెహ్రూ లేచి నిలిచి "ఎంతో కాలము వేచియున్న మీఁదట ఎంతయో కాలము వాక్ఘర్షణములుజరిగిన మీఁదట నెట్టకేలకు నాంధ్రరాష్ట్ర మవతరించినది. ఇప్పుడు మన

మందఱమును ఆ వాక్ ఘర్షణ లన్నింటిని మఱచిపోయి భారత రాష్ట్రమండలిలోఁ గ్రొత్తగా నవతరించిన ఈనూత్న రాష్ట్రము నకు శుభకాంక్షల నందఁజేయవలెను. అంతేగాదు. ఈ రాష్ట్రము అభ్యుదయపరంపరలతో నభ్యున్నతిని జెందుటకు వీలుగా మనమందఱము గూడ సహాయ్యము చేయవలెను. ఇదే నా శుభకాంక్ష. నేటినుండి ఈ యాంధ్రరాష్ట్రము ప్రత్యేక ప్రభుత్వమై తనసంస్కృతిని సంపదను పెంపొందించు కొనుచు దినదినాభివృద్ధిగాంచుఁగాక" అని ప్రకటించి యాశీర్వ దించి యుపవిష్టుఁడయ్యెను. వెంటనే కట్జూ లేచి "నేఁడు 1953 అక్టోబరు మొదటి తేది. ఈరోజున ఆంధ్రరాష్ట్ర మవత రించెను. అయితే, నేఁడు జరిగెడు ప్రారంభోత్సవము కేవలము లాంఛనప్రాయమయినది. నిజము చెప్పవలెననిన, నీరాష్ట్రము ఢిల్లీ పార్లమెంటులో నవతరించినది. పదునైదు రోజులపాటు చర్చింపఁబడిన యనంతరము ప్రజా ప్రతినిధుల సభ యాంధ్ర రాష్ట్రపు బిల్లు నామోదించినది. కాని, ఇది యంతయుఁ ప్రౌఢ మికదశ మాత్రమే. నిజమున కీ నూతన శిశూదయము స్టేటు కౌన్సిల్‌లో జరిగినది. అప్పుడు రెండు శుభసూచనలు కనఁబడి నవి. మొదట, నిది శ్రీకృష్ణ జన్మాష్టమునాఁటి యుదయమునఁ బ్రతిపాదింపఁ బడినది. కృష్ణుఁ డవతరించు సమయమున యమునానదికి బ్రహ్మాండమయిన వఱదలు వచ్చినవి. అట్లే ఆంధ్రరాష్ట్రావతరణలో గోదావరీనదికి గొప్పవరదలువచ్చినవి. వఱదల సంగతి యాలోచించినపు డవి తగ్గిపోయిన తరువాతఁ గలిగెడు మేలును గుఱించి శ్రీకృష్ణజననానంతరము మానవా ళికిఁ గలిగిన మేలును గుఱించి యాలోచింతము. ఇప్పుడుకూడ రాష్ట్రావరణానంతర మాంధ్రప్రజలకు గలిగెడి యభ్యుదయ మును గూర్చికూడ నాలోచింతము.

అటు తరువాత నింతటి గొప్పది మఱియొకటి జరిగినది. స్టేటు కౌన్సిలులో మహోదాత్తముగా జరిగిన చర్చ వినాయక చతుర్థినాఁడు ముగిసినది. మనజాతిచరిత్రలో నిది యతి ప్రధాన మయిన పర్వము. ఈ శుభసమయములో మన యందఱి యాలోచనలు వినాయకచతుర్థిని జాతీయపర్వంగా మార్చిన లోకమాన్య బాలగంగాధర తిలక్ పైకిఁ బఱప వలెను. గణేశ చతుర్థినాఁడే లోకమాన్యుఁడు స్వాతంత్రభారత భావమునకు అంకురారోపణ గావించెను.

ఇపుడిక్కడ మన మీ శుభదినమున అభిజిల్లగ్నమున భానుఁడు మహోజ్వలముగాఁ బ్రకాశించుచుండఁగా హర్ష ధ్వానములమధ్య ఆంధ్రరాష్ట్రము నవతరింపఁజేయుచున్నాము.

మనకందఱకు నెంతో సంతోషముగా నున్నది. ఇపుడవ తరించిన యీ నూత్న రాష్ట్రము సౌఖ్య సుభిక్షములకు నాల వాలము కావలెననియు నాంధ్రప్రజలకు శ్రేయోదాయకమై వర్థిల్లవలెననియు భగవంతుని బ్రార్థింతము. ఈ రాష్ట్ర ప్రజ లందఱు సుఖముగా నివసింపవలయుననియు ఈ నూతనరాష్ట్ర మాంధ్రులకేగాక యావద్భారతదేశమునకు నూతన స్వత్వ మును సమకూర్చెడిదిగా నుండవలయునని కోరుచున్నాను. ప్రతిరాష్ట్ర శాసనసభలోను బ్రజలు దమలోఁ దా మొక భాషలో మాట్లాడుకొనఁగలిగి యుండవలయును. ప్రతిరాష్ట్ర మునకు నా రాష్ట్రభాష జీవగఱ్ఱ. ఆంధ్రులకు భగవానుఁ డష్టైశ్వర్యములను సకల సంపదలను సర్వముతో ముఖాభ్యు దయమును బ్రసాదించుగాక! ఇదే నా యాశీర్వాదము" అని యుపవిష్టుఁ డయ్యెను. పిమ్మటఁ బ్రజల జయజయధ్వానుల మధ్య లేచి తత్త్వవేత్తయగు రాధాకృష్ణుఁ డిట్లాశీర్వదించెను.

3

"ఆంధ్రుల చరిత్రలోను మన దేశచరిత్రలలోనుగూడ నీరో జత్యంత ముఖ్యమయినది. ఈ ప్రాంతప్రజలు తమ కొక ప్రత్యేక రాష్ట్రమును స్థాపించుకొనుటకై రమారమి నలుబది సంవత్సరములుగాఁ కృషి చేయుచున్నారు. ప్రస్తుత భారత ప్రభుత్వము కోరికను నెఱవేర్చినది. ఇప్పుడింక నాంధ్రరాష్ట్రమును బరస్పర సహకార సద్భావములతోఁ గృషిచేసి స్వయం సమృద్ధముగా సకల సౌభాగ్యవంతముగా రూపొందించుకొనవలసిన బాధ్యత యాంధ్రులపైగలదు.

భారత స్వాతంత్ర్య సమరములో నాంధ్రులు మహత్తర పాత్రను నిర్వహించినారు. ఈ సందర్భములోఁ ద్యాగములు చేయుటలోను గష్టనష్టము లనుభవించుటలోను వారు దేశములోఁ దక్కిన యే ప్రాంతములవారికి నే విధముగను దీసిపోలేదు. ఈ సుగుణగణములనే నేఁడు గూడఁ బ్రదర్శించి యాంధ్రరాష్ట్రాభివృద్ధికి భారతదేశాభివృద్ధికిఁ గృషిచేయుట వారి విద్యుక్తధర్మమైయున్నది. ఈ నూతన రాష్ట్రము నెదుర్కొనవలసిన సమస్యలు మిక్కిలి క్లిష్టములైనవి. దీనిని బహిష్కరించుటకు వివేకవంతమయిన నాయకత్వము ప్రజా సహకారముగూడ నెంతయో యవసరము.

స్వాతంత్ర్యము సిద్ధించిన పిమ్మట భారతదేశములోని దక్కిన ప్రాంతములలో జరిగిన విధముగనే మన సంఘములోని పాపశక్తులు పైకి విజృంభించినవి. దురాశ, స్వప్రయోజన పరత్వము పదవీకాంక్ష ప్రబలముగా గానవచ్చుచున్నది. సమైక్యభావము, దక్షత లోపించిన నాయకత్వము ఫలితముగా ప్రజా ప్రయోజనము దెబ్బతినినది. స్వాతంత్ర్య ప్రియత్వ[illegible]వకు నితరులయెడఁ బ్రేమ ప్రధాన లక్షణముకాఁగా ఆత్మ

దురభిమానము పదవీవ్యామోహమునందు మూలకందము. పదవీవ్యామోహ పిశాచగ్రస్తులైనవారి కన్నులకుఁ బొరలు క్రమ్మును. వారి భావనాపథము వక్రమము. భావములు దోషదూషితములు. హృదయములు పాషాణసన్నిభములు. ప్రజాస్వామిక వ్యవస్థ వ్యక్తిగత ప్రయోజనములకుఁ గాక ప్రజాప్రయోజనములనుసాధించుటకు నుపకరణము. స్వతంత్ర భారతదేశమును భక్తి ప్రపత్తులతో సేవింపవలెనని స్వార్థ త్యాగమును ప్రజాశ్రేయోభివృద్ధి సాధన సత్వరతను ప్రదర్శింపవలెను. మన క్రొత్త రాష్ట్ర మిపు డగ్ని పరీక్షకు నిలువవలెను. ప్రభుత్వ మనునది కేవలము ప్రజలను మాత్రమే గాక తనను తానుగూడ నదుపులోఁ బెట్టుకొనవలెనను విషయమును విధాన నిర్ణేతలు పరిపాలకులు తెలిసికొనవలెను. ఇరుగు పొరుగుననున్న మైసూరు, హైదరాబాదు, చెన్న రాష్ట్రములతో నూతనాంధ్రరాష్ట్రము సంబంధబాంధవ్యములకు స్నేహసహకారములకు ప్రాతిపదిక కావలయును. ఏ కుటుంబమునకైనను వర్గమునకైనను సద్భావము లోపించిన నాఁడు అభ్యుదయము కలుగఁబోదు. మన యార్థికరాజకీయ వ్యవస్థలు పునర్నిర్మితములు కావలయును. మనప్రజలుపునరుజ్జీవనముపొంది క్రొత్త జాతిగా విలసిల్లెను. ప్రాఁతవాసనలు సులభముగాఁబోవు. వర్తమానములో గత చరిత్ర చాలవరకు మిళితమైయుండును. వర్ణవ్యవస్థాభిమానము మనల నింకను విడిచిపెట్టలేదు. అభిమానధనులు ఆర్ద్రహృదయులునైన యాంధ్రులకు మహత్తర సంస్కృతి సంప్రదాయమును పరంపరగా వచ్చుచున్నవి. కనుక నిట్టి దురభిప్రాయము లనతి కాలములోనే రూపుమాసి నూతనాంధ్రరాష్ట్రములో మచ్చునకైనఁ గానరాకుండఁ బోఁగలవని విశ్వసించుచున్నాను.

ఆంధ్రదేశము తా నభ్యుదయమును బొంది దేశ సమైక్యమును ప్రబలతరము గావింపఁబడుటకుఁ దోడ్పడినచో భాషాప్రయుక్త రాష్ట్రముల నిర్మాణముతో భారతదేశ సమైక్యత భంగపడఁగలదని భావించువారి భయసందేహ ములు పటాపంచలై పోఁగలవు. కావున మన యాంధ్రనాయకు లయు ప్రజలయు బాధ్యత గురుతరమైనది. మన దేశభక్తిని స్థానికావధులకు స్వవర్గశ్రేయస్సునకుఁ బరిమితము చేసికొనిన నాఁడు మనము జాతినిర్మాణమును సాధింపఁజాలము. కనుక సంకుచిత తత్త్వములకు దృక్పథములకు స్వస్తి చెప్పఁబడవలెను.

క్షణ క్షణమునకు శరవేగముతో మాఱిపోవుచున్న పరిణామశీలమైన ప్రపంచములో మనము రాజకీయముగాఁ జతికిలఁబడియుండఁజాలము. ముందు ముందు విపత్కర పరి స్థితులు రాఁగల సూచనలు కానవచ్చుచున్నవి. వానిని మన మలక్ష్యము చేయఁజాలము. విప్లవాత్మకములైన సాంఘిక సంస్కరణములకుఁ బూనుకొనినపుడే విద్రోహకరశక్తులను సమర్థముగాఁ బ్రతిఘటింపఁ గలుగుదుము. శతాబ్దములతరబడి హిందూ బౌద్ధసంస్కృతులను జీర్ణించుకొనిన సుదీర్ఘమయిన సుప్రసిద్ధ చరిత్ర సంపన్నులైన ఆంధ్రులు ఆర్థిక సాంఘికా సమత్వరహితమయిన యుత్తమ సమాజమును రూపొందించి మానవస్వాతంత్రౌన్నత్యములను సుప్రతిష్ఠితము చేయఁగలరు" అని ఉపవిష్టుఁడయ్యెను. పిమ్మట ఆంధ్రప్రదేశపు గవర్నరు రాష్ట్రపతి రాజేంద్రప్రసాదు పంపిన సందేశము నిట్లు విని పించెను. "నేఁడు ఆంధ్రరాష్ట్రమునకుఁ బ్రారంభోత్సవము జరుగుచున్న దన్న విషయము సంతృప్తికరముగ నున్నది. చిరకాలమునుండి రాష్ట్రము కొఱకై ఆంధ్రు లాందోళన

చేయుచు వచ్చిరి. వారి చిరకాల వాంఛ తీరుచున్న ఈ శుభముహూర్తములో నేను వారికి నా యభివందనములు అందఁజేయుచున్నాను.

ప్రతి ప్రసవము వేదనతోఁగూడుకొన్నదే. క్రొత్తగాఁ బుట్టిన బిడ్డను జాగ్రత్తగా శ్రద్ధగాఁ బోషించుట యవసరము. మన రాజ్యాంగమునుండి యుద్భవించు క్రొత్తరాష్ట్ర విషయములోఁగూడ ఈ సహజక్రమము వర్తించుచున్నది. కాఁగా ఈ క్రొత్త రాష్ట్రమును బోషించి పెంచి పెద్దదానిని జేయవలసిన బాధ్యత ప్రత్యాంధ్రునిమీఁదను ఆంధ్రేతరుల మీఁదనుగూడ నున్నది. ఆంధ్రులమీఁదఁ బ్రత్యేక బాధ్యత యున్నది. నూతన రాష్ట్రము తన కాళ్ళపైఁ దాను నిలఁబడునట్లు చేయుటకును రాష్ట్రములోని ప్రజలు సుఖముగా సర్వ సౌభాగ్యములతోఁ దులదూఁగునట్లు చేయుటకును అంధ్రు లెల్ల సమైక్యకృషి చేయవలయునని కోరుచున్నాను. ఇదే వారికి నా సందేశము. క్రొత్తరాష్ట్రమునకు సంబంధించిన పనియంతయు జాగ్రత్తగా నాలోచించి నిర్దిష్టమయిన కార్యక్రమమును రూపొందించి దానిద్వారా నిర్వహింపవలసియున్నది. అందులో నెంతయో వస్తుసంబంధమైన నైతిక సంబంధమయిన పొదుపు చూపఁబడవలసియున్నది. మనము వ్యయముచేయు ప్రతిపైసయు, చేయు ప్రతి యాలోచనయు ఆడు ప్రతిమాటయు, నిర్వహించు ప్రతికార్యమును రాష్ట్రాభివృద్ధికిని ప్రజా శ్రేయస్సునకును ఎంతయెక్కువ వీలైన నంత యెక్కువగాఁ దోడ్పడెడిదిగా నుండవలెను. అయితే అది మొత్తము దేశక్షేమమునకు జాతిక్షేమమునకు నిరోధకములు కాఁగూడదు. యావద్భారతదేశములో ఆంధ్రప్రజలు ఆంధ్రే

దేశ మొక ప్రముఖభాగము. అయినను యావద్భారత దేశాభివృద్ధికి దోహదము చేయుచు ఆంధ్రదేశాభివృద్ధి జరుగ వలెను.

నూతన రాష్ట్రముద్వారా ఏ యే వాంఛలు సిద్ధింప వలెనని యాంధ్రులు కోరిరో యా వాంఛలు తీరుటకుఁ గృషి చేయుటకుఁ గావలసిన వివేకము ధైర్యము స్వార్థత్యాగము ఆంధ్రనాయకులు ఆంధ్రప్రముఖులు ఆంధ్రప్రజలు ప్రదర్శింపఁ గలరని యాశించుచున్నాను."

అని చదివి యుపవిష్టుఁడయ్యెను. పిమ్మట మదరాసు ముఖ్యమంత్రి చక్రవర్తి రాజగోపాలాచార్యులు నిలిచి "సంయోగ పదార్థమునుండి వేఱుచేయఁబడిన మూలద్రవ్యము నకు అది తన సహజస్థితిలో స్థిరముగా నున్నప్పటికంటె రసాయనికశక్తి యెక్కువగా నుండునని రసాయనిక శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అదే విధముగా నిప్పుడు క్రొత్తగా నావిర్భ వించిన యాంధ్రరాష్ట్రము ప్రజలకు యావద్భారతదేశములోని ప్రజలందఱు కోరుచున్నంత చుఱుకుగాఁ దమరాష్ట్రాభివృద్ధి పొందుటకుఁ దగిన బలోత్సాహములు శక్తిసామర్థ్యములు సమకూరఁగలవని నేను విశ్వసించుచున్నాను" అని ఆశీర్వ దించి పిమ్మటఁ గవిరాజులు—

శ్రీశైలంబును, దక్షవాటియు, శుభశ్రీదంబు కాళాస్తియున్
నీ శూరత్వపు టెల్లలై తనరఁగన్ శ్రీశైల భూలక్ష్మి నీ
యాశాప్తికి రాజధానియయి నేఁ డేతెంచె కర్నూలునం
దాశాదీప్తిగ ఆంధ్రరాష్ట్రమిదె లెమ్మా! ఆంధ్ర! జేవెట్టుచున్.

ఉపవాసశ్రమ మించుకేనియును దా నుల్లంబునం దోఁప నీ
కపరూపంబుగ ఆంధ్రరాష్ట్రమునకై యర్పించె ప్రాణంబు లే

యపరబ్రహ్మము పొట్టిరాము లతనిఁ వ్యాజంబు లేకుండఁగా
నెపుడుఁ గొల్చుచు ఆంధ్ర! యేలుకొనుమోయీ!
స్వీయరాష్ట్రం బిఁకఁ.

కల్పింపుఁడీ మీరు కావ్యంబు లిటుమీఁద
కవులార నవ్యాంధ్ర కళల దీర్చి
ప్రకటింపుఁడీ మీరు పత్రికాధిపులార!
తెలుఁగు వెల్గులు చాటు పలుకుబడులు
పాలింపుఁడీ మీరు ప్రజల ప్రగ్గడలార!
కూడుగుడ్డలకునై మాఁడకుండ
సేవింపుఁడీ మీరు చిన్న పెద్దల నెల్ల
ఒక్కటే దృష్టి నుద్యోగులార!
చదువుఁడీ మీరు క్రొంగ్రొత్త శాస్త్రములను
రత్నములు పండ తెల్గు పొలాలలోన
ఓయి విద్యార్థులార! మీ ధ్యేయమైన
ఆంధ్రరాష్ట్రంబు నేఁడిదే యవతరించె.
పండింపుఁడీ మీరు దండిగా పంటల
ఈతి బాధలులేక రైతులార!
విరఁజిమ్ముఁడీ మీరు పేద సాదలఁ గావ
ధనరాసులను దీసి ధనికులార!
వెలయింపుఁడీ మీరు బేరసారంబులు
స్వల్పలాభములతో వణిజులార!
పాటింపుఁడీ మీరు బహుళాంధ్ర భూమిపై

నీరపూరము లింజనీరులార!
మెట్టుఁడీ మీరు మన పల్లెపట్టులన్ని
ప్రజల యారోగ్యమునుగావ వైద్యులార!
వ్యాజ్యముల మాన్పుఁడీ న్యాయవాదులార!
యాంధ్రరాష్ట్రాభివృద్ధికై యన్ని గతుల.

అని యాశీర్వదించిరి. వెంటనే శ్రీ నెహ్రూ సన్నిధిని శ్రీ టంగుటూరి ప్రకాశముగారు ముఖ్యమంత్రిగను శ్రీ నీలం సంజీవరెడ్డిగా రుపముఖ్య మంత్రిగను ఆంధ్ర ప్రభుత్వ మేర్పడినది.

# ఆంధ్రకేసరి - శ్రీ ప్రకాశము

## పరిచయము

శ్రీ పొట్టి శ్రీరాముల యవతార సమాప్తితో నవతరించిన యాంధ్రరాష్ట్రమునకు ముఖ్యమంత్రిగా వెలసినవారు మన ప్రకాశముగారు. కావున మన ముఖ్యమంత్రిం జీవితయాత్రనుగూర్చి తెలిసికొనుట మన కెంతయు నావశ్యకము.

'పూవు పుట్టఁగానె పరిమళము' అన్నట్లు పంతులు బాల్యమునుండియు ప్రముఖుఁడే. పల్లెపట్టునఁగాని, పట్టణాలలోఁగాని, ప్రధాన నగరములలోఁగాని, చివరకు పరదేశములోఁగాని, ఆయన ప్రాముఖ్యము ఎప్పుడును ప్రకటన మౌచునే యున్నది. సహజముగానే దృఢగాత్రుఁడైన వానికి బుద్ధివైభవము తోడైనప్పుడు ప్రాముఖ్యము కలుగకతప్పదు. కృష్ణానదికి దక్షిణమున రాతిభూమిలో పుట్టుక, సావాసగాండ్రతో సాము గరడీలు స్వచ్ఛందవృత్తి; అనూచాన సంపదనుబట్టి ఆఱువేల నియోగికి సంక్రమించెడి సహజదర్పము, ప్రథమములో సౌఖ్యము, అనంతరము అర్థనాశనము, అధికకష్టములు, ఆత్మోద్ధరణ వాంఛ - ఇవి అన్నీ కదంబప్రాయమయి పంతులు అద్భుత వ్యక్తియయినాఁడు. దుఃఖాభిభూతుఁడు కానివాఁడు ధీరుఁడు కాలేఁడు. ఆదినుండి నేఁటివఱకు ఆంధ్ర కేసరికి వివిధ

వ్యధలు కలుగుచునేయున్నవి. అందుచేతనే అంతటి ప్రౌఢిమ యేర్పడి అంతరాయములలో ఆయన ప్రముఖుఁడే కాని పరాఙ్ముఖుడు కావుట లేదు.

మొన్న మొన్నటివఱకు ఆంధ్రునికి సంపన్న న్యాయవాదే గణ్యుఁడు. అందుచేతనే ఆనాఁడు న్యాయవాదివృత్తి మీఁద మనసుపోయి మదరాసు లా కాలేజీలో చదువుటయు రాజమహేంద్రవరములో వకీలుగా ఉండుటయు సంభవించినది. ఊర్ధ్వదృష్టి ఉన్నవాఁడు ఊరుకోలేఁడు. ఆయన ఉత్త ప్లీడరుగా ఉండక న్యాయవిద్యలో ప్రశస్తమైన బారిష్టరు పట్టము తెచ్చుకొని రాజధానికేపోయి నిరుత్సాహచ్ఛాయ దగ్గరకు రానీయక ధైర్యముతో అడ్డంకులను అన్నిటిని ప్రతిఘటించి అన్నివిధముల ప్రాభవము పొందినాఁడు. సడలని పట్టుదలవల్లనే జయము చేకూరుచున్నది.

అభిమానవంతుఁడు, ఆత్మోద్ధరణాభిలాషి, అన్యజన లక్ష్యము లేనివాఁడు అగ్రగణ్యుఁడు అయినప్పటికి, ప్రకాశము ముఖ్యమంత్రి బాల్యములో పడిన అవమానములు, అనుభవించిన కష్టములు, చేసిన చిలిపిపనులు, శృంగార చేష్టలు, దాచిపెట్టకుండ నిజముగా ఉద్ఘాటించినాఁడు. సహజముగా స్వేచ్ఛబుద్ధికలవారు, ధైర్యస్థైర్యములు ఉన్నవారు ఉన్నది ఉన్నట్టుగా సత్యము చెప్పఁగలరు. పంతులు ప్రకటనముచేసిన విషయములు ఆయనమీఁద అదరముకలిగించుటయేకాక అన్యులకు ఆదర్శము కూడఁ గాఁగలవు."

అని శ్రీ స్వామి శివశంకరులుగారు ప్రకాశముగారి జీవయాత్రకు పీఠిక వ్రాయుచు నుద్ఘాటించిరి. ఇదే ప్రకాశ జీవిత

సారాంశము. కావుటంజేసి మన మా సాహసోపేతకార్య దక్షుని జీవిత విశేషములు తెలిసికొని యానందింతము. ఆ త్యాగ ధనుని సాచివ్యముచే నూతనాంధ్ర రాష్ట్రాభివృద్ధి నభిలషింతము.

## పుట్టుక బాల్యము

ప్రకాశముగారి ముత్తాతలది టంగుటూరు. కావుననే వారి యింటిపేరు టంగుటూరిగా ప్రసిద్ధికెక్కినది. తరువాత వారి తలిదండ్రులు వేంకటగిరి సంస్థానములోని వల్లూరులో నివసించెడివారు. తాతలు కట్టించిన నాలుగిండ్ల బవంతి నలువది యేఁబది యెకరాల భూవసతికూడ నాయూరిలో వీరి కుండెడిది. ప్రకాశము గన్నతల్లి సుబ్బమ్మ, తండ్రి గోపాల కృష్ణయ్య. ౧౮౭౨వ సంవత్సరములో 'కనుపర్తి' గ్రామములో మేనమామలయింటఁ బ్రకాశము జన్మించెను. ఏఁడాదిపాటక్కడనే పెరిఁగెను. తరువాతఁ దల్లితో వల్లూరు వచ్చెను. ప్రకాశము పుట్టిన రెండుమూఁడేండ్లకు దేశములో అనావృష్టి యధికమైనది. వల్లూరు భూములవల్ల వచ్చెడి యాదాయముతోఁ బ్రకాశము తండ్రి కుటుంబపోషణము చేయఁజాలకుండెను. అంతలో గోరుచుట్టుపై రోకటిపోటువలె ధాత సంవత్సరపుఁ గఱవుకూడ వచ్చినది. ఇఁక జెప్పెడిదేమున్నది? ప్రకాశము తండ్రి గోపాలకృష్ణయ్య మఱొక 'యుపజీవనము' సంపాదింపవలె ననియు తలంచెను. ప్రకాశమున కయిదేండ్ల ప్రాయము వచ్చుదాఁకఁ దండ్రి యతికష్టముగాఁ గుటుంబపోషణము చేసికొనసాగెను. అయిదేండ్లు దాఁటియు దాఁటకమునుపే ప్రకాశమున కుపనయనముగూడ జేయఁబడెను.

## చదువు సంధ్యలు

ప్రకాశమునకు బ్రహ్మోపదేశ గురువు పిల్లుట్ల చెంచయ్యగారు. అక్షరాభ్యాస గురువు వల్లూరులోనున్న వెంకటప్పయ్యగారు. ఓనమాలు నేర్పిన దా యాదిగురువె. ఆతఁడే ప్రకాశము విద్యాసౌధమునకుఁ బునాదిరాయి వేసినవాఁడు. ప్రకాశము చిన్నప్పటినుండి పెంకితలకాయ. తిన్నగాఁ జదువక పేచీలు పెట్టుచుండెడివాఁడు. తఱచుగా తొడపాయసాల బహుమానము లందుచుండెను. చర్మమూడి చేతిలోఁ బడెడియంత పాయసము పెట్టినఁగాని ప్రకాశము పాఠము చదివినపాపమునఁ బోలేదు. మన ప్రకాశమును ఇంటియొద్దనుండి బడిలోనికిఁ బంపునప్పటికి బ్రహ్మదిగివచ్చెడివాఁడు. కాళ్లు చేతులు కట్టి గంజికావడిపట్టి తీసికొని వెడలి బడిలోఁ బడవేసెడివారు. బడిలోఁ గూర్చుండఁబెట్టుటకు గురువులకుఁ దలప్రాణము తోఁకకువచ్చెడిది. వల్లూరులోఁ గొన్నాళ్ళపాటు చదివించినారు. పిమ్మట గోపాలకృష్ణయ్యగారు జీవనోపాధికి మఱొకగ్రామమున కేఁగఁ దలఁచి ప్రకాశమును వారి పెద్దబావగారగు పోరూరి నరసింహముగారియొద్ద అద్దంకి గ్రామములో నప్పఁజెప్పిరి. నరసింహముగారే యాయూరి వీధిబడికి గురువు. కావున మన ప్రకాశమునకుఁ గట్టుదిట్టముగా విద్య నేర్పెను. చదువుకొనెడి రోజులలో ప్రకాశము పెద్దబావనుబెట్టిన బాధలు పెరుమాళ్ళకెఱుక. ముప్పతిప్పలుపెట్టి మూఁడుచెఱువుల నీళ్ళుత్రావించెడివాఁడు.

తండ్రి ప్రకాశమును బెద్దయల్లుని యొద్ద నప్పఁజెప్పి కుటుంబపోషణకై వేంకటగిరి సంస్థానమున కేగి వీరిని వారిని నాశ్రయించి చిట్టచివరకు నాయుడుపేటదగ్గఱనున్న సువర్ణముఖీ నదియొద్దనఁగల 'మేనకూరు ఒంటు' 'పారుపత్తెము

దారు' ఉద్యోగము సంపాదించుకొనెను. జీతము ఎనిమిది రూపాయలు. కుటుంబము వల్లూరులోనే యుండెడిది. ఆ కష్టజీవి మాత్రము రెండేండ్లపాటూ మేనకూరులోనే యుండి వండుకొని తిని జీవించి యుద్యోగము చేసెను.

అద్దంకిలోఁ బ్రకాశము 'వీధిబడి' చదువు పూర్తియైనది. ఇంగ్లీషు చదువుకై నాయుడుపేట కేగెను. గోపాలకృష్ణయ్య పుత్రుని చదువు సాగుటకై కుటుంబమును గూడ నాయుడుపేటకుఁ బంపెను. ప్రకాశము, వారి తమ్ముఁడు శ్రీరాములు ఇద్దఱుగూడ నాయుడుపేటలోఁని యాంగ్లపాఠశాలలోఁ జేరినారు. తండ్రిగారు పిల్లల యోగక్షేమములు చూచుకొనుచు మేనకూరి యుద్యోగవిధులను నెఱవేర్చుకొనుచుండిరి. తండ్రి ధాన్యపు శిస్తులు వసూలుచేయుటకై వెడలునపుడు ప్రకాశము కూడఁ దండ్రితోఁగూడ వెడలి అర్ధరూపాయ రైతులవలన బహుమానములుగాఁ బడయుచుఁ దండ్రిగారి కప్పుడప్పుడు లెక్క డొక్క వ్రాసిపెట్టుచు నుండెడివాఁడు.

కాని గోపాలకృష్ణయ్య కష్టాలు గట్టెక్కలేదు. రెండు మూఁడుసారు లుద్యోగముకూడఁ బోయినది. ఒకమూల గంపంతసంసారము. ముగ్గురాఁడుపిల్లలు, ముగ్గురు మగబిడ్డలు, పెండ్లిండ్లు పేరంటములు, సారెలు చీరెలు, చదువులు సంధ్యలు అబ్బా! యెన్ని కావలెను సంసారికి?

నాయుడుపేటలో ఫస్టు, సెకండు, థర్డు, ఫోర్తు అప్పరు ఫోర్తు అని యయిదుక్లాసు లుండెడివి. ఇంగ్లీషుతోపాటు ఉర్దూకూడఁ జెప్పెడివారు. తెలుఁగు ఇంగ్లీషు, ఉర్దూలు చదు

వుచు మన ప్రకాశము చదువులోఁ బ్రకాశించెను. కాని యల్లరిలో అందెవేసినచేయి ! మొనగాఁడు.

## ప్రకాశము - బాల్యచేష్టలు

ప్రకాశమునకుఁ జదువుకొనెడు రోజులలో నొకవంక పలుగాకి మూఁకలును, మరొకవైపున బుద్ధిమంతులు, విద్యావంతులునైన సంపన్న గృహస్థులును స్నేహితులుగా నుండెడి వారు. చదువుకొనెడు వాళ్ళలోఁ బ్రకాశమునకు మొదటి సంగాతకాఁడు కానూరి రంగడు. (రంగారావు) అతఁడు స్నేహితుఁడేకాఁడు. ప్రకాశమునకు సాముగరడీలలో, కుస్తీలు, చెడు గుళ్లలో గురువుకూడ. సువర్ణముఖీనదియొడ్డుననుండెడి యాంజనేయస్వామికి రంగఁడు కోడిగ్రుడ్లు నైవేద్యముపెట్టి యాప్రసాదము చెలికాండ్రందఱికిఁ బెట్టెడివాఁడు. అట్టి యోగ్యునితో మన ప్రకాశము నెయ్యముచేయుట గాంచి లోకులందఱు "రంగఁడు దుర్మార్గుఁడు. చదువు సంధ్య లేనివాఁడు వానితో నీకు స్నేహమేమిటిరా ? ప్రకాశమూ"అని మందలించెడివారు. ప్రకాశమునకా యా మందలింపులు భీతికొల్పునవి పెడచెవిని బెట్టెను. రంగఁడు, తాను గలిసి ప్రకాశము 'చల్ మోహనరంగా ?' యనుచుఁ దిరుగుచుఁ దోడి విద్యార్థులను దన్నుట, ఏడిపించుట, పుస్తకాలు పాఱవేయుట నుపాధ్యాయుల నుడికించుట మొదలగు ఘనకార్యములు మొదలిడెను.

ఒకనాఁడు పుదూరు సుబ్రహ్మణ్యయ్యరు అను నుపాధ్యాయుఁడు బోర్డు వైపునకుఁ దిరిగి లెక్కలు చెప్పుచుండెను. ప్రకాశము మెల్లఁగా నాతని గోచిలాగి కుర్చీకి కట్టెను. వెంటనే ప్రకాశమునకు బెత్తాల దెబ్బలు మొట్టికాయలు బహూకరింపఁ బడుటయేకాక డిస్మిసలార్డరుచేతికి వచ్చెను. పాపము తండ్రి

గోపాలకృష్ణయ్య నోరునెత్తి బాదుకొని యొక్క డిప్యూటీ కలెక్టరు నాశ్రయించి మరల ప్రకాశమును బడిలోఁ జేర్పించెను. కాని యేమిలాభము! ప్రకాశము వెంటనే మరొక 'జట్టీ' తెచ్చిపెట్టెను. అల్లాడి సూర్యనారాయణ తన నేదోయన్నాఁడని వాని యింగ్లీషుపుస్తక మెత్తుకొనిపోయి స్వర్ణముఖ యొడ్డున ముక్కముక్కలుగాఁ జింపివైచెను. అది యొక్క యానాది చూచి యా ముక్కలు తెచ్చి యుపాధ్యాయుల కిచ్చెను. వెంటనే వెనుకటిచరిత్ర ప్రత్యక్షమయ్యెను. మామూలు దెబ్బలుకొట్టి డిస్మిసుచేసినారు. తిరిగి తండ్రిగారా కలెక్టరుగారి నాశ్రయించినారు. కలెక్టరుగారు ప్రకాశమును బిలిచి 'ఎందులకిట్టి తప్పు చేసినావు' అని ప్రశ్నించెను. ప్రకాశము కలెక్టరుతో 'నిన్న నన్నాతఁడు కొట్టినాఁడు ఆ పగతీర్చికొనుట కీపని చేసినాను' అని బదులు చెప్పెను. కలెక్టరు 'ఇఁక నెప్పుడిట్టి పాడుపనులు చేయకు'మని బుద్ధి చెప్పి మరల బడిలోఁ జేర్పించెను.

ప్రకాశము తనకే వస్తువు కావలసినను ఆ వస్తువున్నవారి దగ్గరకేగి యది 'జబర్దస్తీ'గా లాగికొనెడువాఁడు. ఆ వస్తువులవా రెందఱోవచ్చి ప్రకాశమునుగూర్చి తల్లితో ఫిర్యాదు చేయుచుండెడివారు. ఆ యిల్లాలు పుత్రప్రేమతో నా 'తవ్వాయి' తెల్లఁ దీర్చెడిది.

ఆటపాటలలోఁగూడఁ బ్రకాశము పోటరిమానిసిగానే ప్రఖ్యాతి గాంచెను. దండెములు తీయుట, కుస్తీలు పట్టుట, మావటీని కేదోయిచ్చి వేంకటగిరిరాజాగారి యేనుఁగులనెక్కి స్వర్ణముఖ సైకతస్థలులలో సికారులు కొట్టుట, యా యిసుక తిన్నెలపైని వేషభాషలతోఁ గాలక్షేపము శేయుటలతో

నాయుఁడుపేట విద్యార్థిదశ యంతయు ప్రకాశమునకు నిర్లక్ష్య జీవితమున దారిచూపెను.

నాయుడుపేట యొక చిన్నగ్రామము. ఇళ్ళు చాల తక్కువ. అప్పటికి ప్రకాశము చదువుబడి మాత్రమే పెద్దది. స్వర్ణముఖీ కాలువగట్టునఁ గల యన్నపూర్ణ దేవాలయము, రాజుగారి యేనుఁగులసాల మాత్రము కొంచెము పెద్దది. తండ్రి పొరుగూరిలోనుండుటచేఁ ప్రకాశ మొక స్వాములవారి మఠమునకుఁ జెంతఁగల పూరియింటనుండెడివాఁడు. మోడరక్ ఫర్డుఫారమువరకు చదువువఱకు రెండు మూఁడేండ్లు ప్రకాశము నాయుడుపేటలో నుండెను. తండ్రికి 'మల్లాం' పారుపత్తెము నకు బదిలీయైనది. తండ్రి కుటుంబమును మల్లామునకుఁ దరలించి ప్రకాశమును కన్నెపల్లి వెంకమ్మగారింటఁ బెట్టెను. ఆమెయే ప్రకాశమును సాకుచుండెను. ఇంతలోఁ గటికి కాటకమువచ్చినది. వల్లూరుభూములకుఁ బన్నులుచెల్లలేదు. జప్తులు పెట్టి ఎస్టేటువారు వేలము వేయించినారు. ప్రకాశము తండ్రి గోపాలకృష్ణయ్యగారి సంసారము పూర్తిగాఁ జితికిపోయినది.

తండ్రి మరణము

ఈ స్థితిలోఁ ప్రకాశము తండ్రి హఠాత్తుగా శూలనొప్పి వచ్చి స్వర్గస్థుఁడయ్యెను. సంసారభారమంతయుఁ దల్లిమీఁదఁ బడెను. పిల్లలు చీమచిటుకు—ఒక్కనికి ముక్కుపచ్చలారలేదు. పెద్దవారగు నాఁడుపిల్లలిద్దఱుమాత్రము కాఁపురాలు చేసికొను చున్నారు. ఎటుచూచినను ఏమియులేదు. అంతయుశూన్యము. నిష్పచ్చరము ఏమిచేయఁగల దా తల్లి? తోడఁబుట్టినవారికిఁ దీనస్థితి తెలియఁ జేసెను. వారు వచ్చి కనుపర్తికిఁ దీసికొని వెడలిరి. పిదపఁ గొన్నాళ్లు వినోదరాయులు పాలములో

మున్నారు. ప్రకాశము మేనమామలుకూడ కలిగినవారుకారు. ఏదో కాయకష్టమువలనఁ బొలముదున్నుకొని బ్రతికెడివారు. తమ సంసారము తామే యీదలేనివారు. ఈ సంసారము నెట్లు మోయఁగలరు ? అదిచూచి ప్రకాశము తల్లి కచ్చటనుండుటకు మనసొప్పలేదు. పుష్పాలమ్మినచోటఁ గట్టెలమ్మఁజాలని యా యమ్మ పిల్లలను దీసికొని ఒంగోలునకుఁ బోయెను. 'హోటలు' పెట్టెను. పూఁటకూళ్ళిళ్ళు పెట్టుట నీచ మని యెఱిఁగినను ఆ తల్లికి బిడ్డల చదువు సాగుటయే ముఖ్యము. ఎవ్వరేమను కొన్న నేమి ? పిల్లలకు తెక్కలు వచ్చి వారల బ్రతుకు వారు బ్రతుకుచుంటె అన్నియు పడిసిపాటిపోవును. అని మనసు దృఢపరచుకొనెను. 'అదే కదా మాతృ హృదయములో నుండెడి ప్రేమామృతము.'

పంద్రెండేండ్ల వయసుగల ప్రకాశముతల్లికడుపుచలువచే ౧౮౮౪ వ సంవత్సరములో లోయర్ ఫోర్తులోఁ జేరి అప్పర్ ఫోర్తుదాఁక నొంగోలులోఁ జదివెను. 'మిడిల్ స్కూలు' పరీక్షకు హాజరై ప్రథమశ్రేణిలో నుత్తీర్ణుఁడయ్యెను. కాని అల్లరిచిల్లరి సహవాసాలు మానలేదు. ఉపాధ్యాయుల ధిక్కరించుటలు, వెక్కిరించుటలుగూడఁ బరిపాటియైనది. బొంగరాలు, గోళీలు మున్నగు నాటలలోను చెడుగుడులోను పెద్దటికము ప్రకాశ మునదే. క్రికెట్టుమీఁదఁగూడ మోజుపడినాఁడు. దానికి డబ్బు లేదు. కొందఱి నొక ముఠాగాఁ జేర్చి బజారువెంటఁబడి యాట వస్తువు లమ్మెడివారి కన్నులలోఁ గారము కొట్టి ధనసంపాదన మొదలిడెను. ప్రతిదినము ధనమునకై తడుముకొన నారం భించెను. ముఠాయందఱుగలిసి యాలోచించినారు. ఆముఠాకి నాయకుఁడు అద్దేపల్లి అప్పడు.

ఒంగోలునకు దగ్గఱగానున్న రంగారాయుడు చెఱువు క్రింద 'వరిగె' చేను పండి కోఁతకు సిద్ధముగానున్నది. ప్రకాశము ముఠా యర్ధరాత్రివేళ వెడలి యాచేనతంతయుఁగోసి గట్టలు కట్టి నెత్తిని పెట్టుకొనెను. కావలివాఁడు లేచి కేకలుపెట్టెను. చుట్టుప్రక్కలవారు నలుగురువచ్చి ముఠాను పట్టుకొని పెడ రెక్కలుకట్టి నిలువఁబెట్టినారు. ఇంతలోఁ బెద్దలు పదిమందివచ్చి ముఠాను విడిచిపెట్టించినారు. నాఁటినుండి ముఠాకు 'ఊట్ కంపెనీ' యని పేరువచ్చినది. దొంగతనముచేసిన చిన్నతనముచే నాల్గు రోజులపాటు ప్రకాశముముఠా వీథిముఖము చూడలేదు

## నాటకరంగ ప్రవేశము

ప్రకాశమునకు 'లోయర్ ఫోర్తు' చదువు పూర్తియైనది. అదేసమయమున 'పూనాకంపెనీ' ఒంగోలునకు వచ్చినది. ఆ కంపెనీవారు హిందీ నాటకాలు ప్రదర్శించినారు. ప్రకాశమునకుఁ దల్లియై, తండ్రియై, గురువై, దాతయై, సంరక్షకుఁడై, యన్న ప్రదాతయై రక్షించిన ఆమ్మానేని హనుమంతరావు నాయుడు గారికిఁగూడ నాటకములన్నఁ జాల సరదా! కావున మన ప్రకాశము నాటకరంగాల కెక్కెను. ఆఁడువేషాలు వేయుటలోఁ బేరుమ్రోఁగెను. పీష్వా నారాయణరావు నాటకములో నారాయణరావు పాత్ర ధరించి గణన గాంచెను. ప్రకాశము ఒకవైపున నాటకాలలోఁ బాల్గొనుచు రెండవ వైపున మిడిల్ స్కూలు పరీక్షకు సంసిద్ధుడు కావలసివచ్చెను.

ప్రకాశముతల్లి, యమ్మమ్మగూడఁ నతని నాటకాల గొడవ విని చాల బాధ పడుచుండిరి. వారి చేఁజిక్కకుండ నే ప్రకాశము స్వైరవిహారము చేయుచుండెను. ఒకరి యదవు

ఆజ్ఞలలో లేకుండఁ దోఁచినట్లు తిరుగు విద్య ప్రకాశమునకు వెన్నతోడనే పెట్టంబడినది. ఎట్లు తిరిగినం జదువులో వెనుక పడలేదు. కావునఁ కన్నకల్లికడుపుతీపిచేఁ గుమారుని నేమియు ననలేకపోయెను.

'హోటలు' పెట్టినను వారిదారిద్ర్యముతీరలేదు. పూఁటకూళ్ళమీఁదఁ వచ్చెడిది పొట్టలకుఁ జాలెడిదికాదు. తల్లి ప్రకాశమును సంపన్నుల ఇండ్లలో 'వారాలకు' నొప్పఁజెప్పెను. పుస్తకాలకు 'డబ్బుదస్కము' కావలసి వచ్చినప్పుడు నాగరాజు సూర్యనారాయణరావు అను తెలుఁగు వకీలు ప్రకాశమునకు సాయపడుచు కాని, పరక ఇచ్చుచుండెను. గుడ్డిగవ్వకుఁ గొఱగాని యా రోజులలో మిడిల్‌స్కూలునకు మూఁడు రూపాయలు దరఖాస్తు కట్టవలసి వచ్చినది. ఆ ముష్టి మూఁడు రూపాయలకొఱకుఁ పాపము బ్రకాశము ఒంగోలునకు ౨౫ మైళ్ళదూరమునం దున్న బావగారి యింటికిఁ గాలినడకను బయనమై వెడలెను. నడక దండగయే కాని యా మూఁడు రూపాయలు బావగారు ప్రకాశమున కీయలేకపోయెను. తిరిగి ప్రకాశము దేవుఁడా యనుచు నింటికివచ్చి యా సంగతి తల్లి కెఱిఁగించెను. పాప మా యిల్లాలు కలిగిన యాశాభంగమునకుఁ జింతిల్లక తన పట్టుచీర తాకట్టుబెట్టి మూఁడురూపాయలు తెచ్చియిచ్చి ప్రకాశమును పరీక్షకంపెను. ఆ గండము గడచి గట్టెక్కెను. పరీక్షలో విజయము గాంచెను. మిడిల్‌స్కూలులో చదివెడినాఁడె ప్రకాశమునకు వకీలు కావలెననియు, లాంగుకోటు వేసికోవలయుననియుఁ గోర్కెకలిగెను. ఆ చిన్ననాఁడె లాంగుకోటుకూడఁ

గుట్టించుకొని తొడిగికొని నిజముగా ప్లీడరయినట్లు మురిసి పోయెను.

## రాజమహేంద్రవర ప్రయాణము

రాజమహేంద్రవరము విద్యల కాటపట్టని వీనుమిగిలినది. అంతేకాక ప్రకాశము కాఁపురముండెడియింటిదగ్గఱఁ గొందఱు బ్రాహ్మణులు రాజమహేంద్రవరము వెడలి చదువుకొని వైదికవిద్యాపండితులై వచ్చినారు. వారిఁ జూడఁగానె ప్రకాశమునకు రాజమహేంద్రవరమునకు నేఁగవలయునను నభిలాష మఱి యెక్కువైనది. ప్రకాశమును రెండుచేతులతోడ నుద్ధరించినవాఁడు శ్రీ ఇమ్మానేని హనుమంతరావునాయఁడుగారు. ఆ మేధావి 'మిషన్‌స్కూలులో' నుపాధ్యాయుఁడు. ఆతఁడు చదివినది మెట్రిక్యులేషనే యైనను బి. ఏ తరగతివారుకూడ వారియొద్ద లెక్కలు చెప్పించుకొనుచుండెడివారు. అట్టి గట్టి గణితశాస్త్రిల ప్రేమకుఁ బాత్రుఁడై ప్రకాశము 'మిషన్ స్కూలు ప్రధానోపాధ్యాయునికి హనుమంతురావుగారు వాక్సహాయము చేసి 'స్కాలర్‌షిప్' ఇప్పించెను. దానితో బ్రకాశము మెట్రిక్యులేషన్ క్రిందితరగతియగు నైదవతరగతి చదివెను. అప్పటికి వెనుకటియల్లరి చాలవఱకుఁ దగ్గినది. కాని నాటకాల గొడవ యథాప్రకారముగానే యున్నది.

హనుమంతరావు నాయఁడుగారికి మిషన్‌స్కూలులో నిచ్చెడు ముప్పదిరూపాయల జీతము కుటుంబపోషణకుఁ జాలుట లేదు. కావున బంధువర్గమున్న రాజమహేంద్ర వరమునకు వెడల నతఁడు నిశ్చయించుకొనెను. ప్రకాశము నాయఁడు గారు కాదుకూడ దనినను మానక వారితో రాజమహేంద్ర వరమునకుఁ బ్రయాణ మయ్యెను. సరే బ్రయాణము సిద్ధ

మయ్యెను. నాయఁడుగారు ప్రకాశమును దనకుటుంబమును వెంటఁగొని యంచెబళ్ళమీఁద బెజవాడమీఁదుఁగా రాజమహేంద్రవరము చేరెను.

నాయఁడుగారి సంసారము చాల పెద్దది. అయిననేమి? ఆ ధీరునకుఁ బ్రకాశ మొక పుత్త్రుఁడయ్యెను. ప్రకాశము రాజమహేంద్రవరములోని చారిత్రకప్రదేశము లన్నియు దర్శించి, గోదావరిని దిలకించి పులకించి ముగ్ధుఁడయ్యెను.

నాయఁడుగారు ఢీస్ట్రిక్ హైస్కూలులో గణితోపాధ్యాయుఁడుగాఁ బ్రవేశించెను. ప్రకాశము కొన్నాళ్ళు రాజమహేంద్రవరములోనుండి తిరిగి యింటికిఁ బ్రయాణమై పడవల రేవులోనికి వచ్చెను. ఇంతలో నాయఁడుగా రింటికివచ్చి ప్రకాశము వెడలిపోయెనని కన్నీరుకార్చుచుండెను. ప్రకాశమునకుఁ బడవదొరక లేదు. నాయఁడు గారింటికివచ్చి చేరెను. ప్రకాశమును గాంచి నాయఁడుగారు పొందిన యానందము నెవ్వరు వర్ణింపఁగలరు? "రా బాబూ! ప్రకాశమూ! రా! పడవ దాఁటిపోయినది. మంచిపని జరిగినది. అక్కడమాత్రి మెవరు నిన్నాదుకొందురు? మీయమ్మ, అమ్మమ్మ యెన్నాళ్లు నీకై తంటాలు పడఁగలరు. నాతోపాటే ఇక్కడ నుండు" అన్నారు. క్షణమాలోచించి ప్రకాశము చిత్తమన్నాఁడు. అదే యతని యున్నతదశ కారంభఘుటిక.

## నాటకాలు

నాఁటి రాజమహేంద్రవరము సకల భాషావేత్తలగు మహాపండితులతోఁ గలకల లాడుచుండెడిది. ప్రకాశము నాయఁడుగారి సహాయముతో వారి 'హైస్కూలులోనె'

విద్యార్థివేతనముపొంది మెట్రిక్యులేషన్ చదువుచుండెను. గయోపాఖ్యానములో గయుని భార్య చిత్రరేఖ, అర్జునుఁడు కూడఁ దానేయై రంగస్థలమున నటించుట మొదలు పెట్టెను. సంగీతముచే బేరసారము లుడిగెనన్నట్లు ప్రకాశమా యా యేఁడు నాటకాల గొడవచే మెట్రిక్యులేషన్ పరీక్ష తప్పెను. దానితో 'మొండిఘటముగా' దయారయ్యెను. బండి పట్టాలు తప్పెను. తగాయిదాలు హెచ్చెను. బజారు సరకుతోఁ 'బోటాం' పోటీలు బాహాబాహి, శిఖాశిఖి యుద్ధములుగూడఁ ప్రారంభమైనవి. హనుమంతరావుగారు మందలించి బుద్ధిచెప్పి నారు. తల తిరిగినది. తాను నెందులకు రాజమహేంద్రవరము వచ్చెనో జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. 'ప్రయివేటు' గాఁ జదివి పరీక్షకు వెడలి యుత్తీర్ణుఁడయ్యెను. నాయఁడుగారు చేయు చున్నది యుపాధ్యాయవృత్తియైనను స్వాతంత్ర్యాభిలాష కల వాఁడు. ఒకరి క్రింద 'నౌకరి' చేయుట కిచ్చగించెడువాఁడు కాఁడు. ఆ భావములు ప్రకాశము గురువునుండి నేర్చెను. స్వతంత్రవృత్తి నవలంబింపఁదలచెను. 'ప్లీడరీ' మీఁది 'మోజు' తగ్గలేదు. ప్రొద్దెల్ల నాతతాయులతోఁ దిరుగుట, పడవల మీఁద షికారులు గొట్టుట, గోదావరిలో నీఁదుట, మునుఁ గుట, గండములుగడచి గట్టెక్కుట, యగపడినవానితోఁ నెల్ల గయ్యమునకుఁ గాలు ద్రవ్వుట యిదే దైనందినవృత్తి యయ్యెను. అదే రోజులలోనే ప్రకాశమునకు వివాహము గూడ జరిగినది.

పెండ్లి కాఁగానే ప్రకాశము చదువు ప్రారంభించి యఫ్.ఏ. చదువ మొదలిడెను. కూర్మా వేంకటరెడ్డి నాయఁడు, చిట్టూరి నూరయ్య, కంచుమర్తి రామచంద్రరావు మొదలగువారు

సహాధ్యాయులు కాఁగా సాగించుచుండెను. యఫ్. ఏ. పూర్తి యగు లోపల నాటకాలవల్ల బ్రకాశమునకు గీర్తితో పాటు "ఓరిబాబూ! ప్రకాశముజోలికి పోకండిరా! మాట్లాడితే చేయెత్తి మాట్లాడును' అను పేరుకూడ వచ్చినది. కాకినాడ మొదలగు పట్టణములకుఁ బోయి నాటకాలు వేసి యచ్చటి 'బజారురాడీల' తోఁ బేచీలు పెట్టుకొని కచ్చేరీలకెక్కి, మహా ఘనుఁడన్న పేరుగాంచెను. మెట్కాఫ్ దొర యొక కంటితోఁ జూచి కాపాడియుండనిచోఁ బ్రకాశముచరిత్ర మరొక లాగున వ్రాయఁబడెడిది.

ప్రకాశమునకు నిరువది సంవత్సరములు నిండినవి. ౧౮౯౨ వ సంవత్సరమున వకీలు పరీక్షకై శ్రద్ధగాఁ జదివెను. ౨౧ సంవత్సరములు నిండినఁగాని యీ పరీక్ష కానాఁడు కూర్చుండుటకు వీలులేదు. వయస్సు నిర్ధరించుమని డాక్టరు నడిగెను. డాక్టరు కోమా 'ప్రకాశమూ! నీ కింకను జ్ఞాన దంతము రాలేదు. ఉల్లాకు (సర్టిఫికెట్) నీయ'నని నిరాకరించెను. పాపము ప్రకాశము నిరాశచెందెను. ఒక సంవత్సరము వ్యర్థమయ్యెను. ఆ యేఁటితో యఫ్. ఏ. చదివినవారికి "ఫస్టుగ్రేడ్ ప్లీడరీకి' ప్రయివేటుగా జదువు నవకాశముతొలఁగి పోవుచున్నది. ఇఁక బి. ఏ. చదివినఁగాని ప్లీడరీకిఁ జదువ వీలు లేదను నియమాలుకూడ రానైయున్నవి. ఏమిటి చేయుట! ముందు నూయి వెనుక గోయి. తాడు బొంగరము లేని ప్రకాశము చెన్నపట్నము వెడలి, లా కాలేజీలోఁ జదువుటయెట్లు?

## లా కాలేజిలో – చదువు, లాయరువృత్తి

ఉన్నారుగా పాపము హనుమంతరావునాయఁడుగారు. "అబ్బాయీ! ప్రకాశము, భయపడకు. సాహసేలక్ష్మీఅన్నారు

పెద్దలు, అని కొణితివాడ జమీందారు దగ్గరకేగి తొంబది రూపాయలడిగి తెచ్చి యిచ్చెను. అదే ప్రకాశమునకు లా చదువుటకుఁ జేయూతనిచ్చినది. మదరాసుచేరి లా కాలేజీలోఁ బ్రవేశించెను. లా కాలేజీలోఁ ప్రవేశించి వెనుకటి చిలిపిపనులు మాని ప్రథమ శ్రేణిలో విజయము గాంచుటకై యత్నించి పరీక్షకు వెడలి రెండవతరగతిలో లాలో నుత్తీర్ణుఁడయ్యెను.

పరీక్షకాఁగానే ఒంగోలువచ్చి మైదాఖు కేసులలోఁ బనిచేసి గెలిపించెను. అప్పటికిఁ దల్లిగారింకను 'హోటలు'తో శ్రమపడుచునేయుండెను. ఆ కేసుల గెల్పుతో ప్రకాశము చేతిలో రెండు మూఁడువందల రూపాయలు పడినవి. దానితో బంధువు లందఱు ప్రకాశమును ఒంగోలులోనే 'ప్రాక్టీసు' పెట్టుమని సలహాయిచ్చిరి. స్వీయసంసారమునుగూడ నసౌకర్యముల పాలుచేసికొని, చిన్ననాటినుండి తనకు విద్యాబుద్ధులు చెప్పించి బాగుచేసిన హనుమంతరావుగారిని విడిచి పెట్టుటకు ప్రకాశమునకు మనస్సు ఒప్పలేదు. నాయుఁడుగారి కాశాంభంగము గలిగించుట కొప్పుకొనలేదు. లాయరుపట్టావచ్చినది. రాజమహేంద్రవరము వెళ్ళి ౧౮౯౪ సంవత్సరములో 'ప్రాక్టీసు' ప్రారంభించెను. ప్లీడరుకు గావలసిన సామాగ్రి యంతయు సేకరించుకొనెను.

ఆరంభించిన నాఁటినుండి ప్రాక్టీసు బాగుగనే యందుకొన్నది. పెద్దప్లీడరుల స్థాయిని అందుకొనెను. ఒకప్పు డొక చిత్రమైన కేసు వచ్చినది. ఇద్దఱు కుఱ్ఱవాండ్రు రైల్వేపార్సెలులోని వెండిపాళీలు దొంగిలించి సారంగధరుని మెట్టయొద్ద దాచి పెట్టినారు. పోలీసు పట్టుకొని 'కేసు' పెట్టినాడు. ఆ కుఱ్ఱవాండ్ర న్యాయవాది ప్రకాశము. మేజస్ట్రేటు కేసు సెషన్సుకి

పంపినాఁడు. సెషన్సుజడ్జీ ముందే యొక యభిప్రాయమునకు వచ్చి ముద్దాయిలలో నొకఁడు నేర మొప్పుకొనినాఁడు కాన ఒప్పుకొన్నవాని కొక సంవత్సరము, నేరమంగీకరింపనివానికి నైదేండ్ల శిక్ష విధించినాఁడు. ప్రకాశము నిరుత్సాహపడక హైకోర్టునకేగి లా పుస్తకములన్నియుఁ జదివిచదివి దొంగ యాస్తి గుఱించి 'యాచోకి' యిచ్చినంత మాత్రముచేత నేరము రుజువుకాదను తీర్పును దీసి జడ్జీకిఁ జూపించెను. సర్ డేవిస్, సుబ్రహ్మణ్య అయ్యరు అను జడ్జీ లాతీర్పు నాధార ముగాఁ జేసికొని శిక్షకొట్టివేసి 'ముద్దాయీల' విడిచిపుచ్చి నారు. దానితో ప్రకాశము పేరు మఱి మ్రోఁగిపోయినది. ఒకమూల మునసబుకోర్టులో ఫైలు పెరిఁగినది. ఒంటెద్దుబండి నుండి గుఱ్ఱపుబండి కారుల దాఁక హోదా పెరిగినది. మొట్ట మొదటనే ప్రకాశము ఒక 'అర్ధణా' కేసు గెలిపించినాఁడు.

ఏలూరుదగ్గఱనున్న చాటపఱ్ఱులో మాగంటి లక్ష్మణ దాసు అను పేదరైతు టోలుగేటు ఫీజు 'అర్ధణా' చెల్లింపక వెడలిపోయెను. అది కారణముగా కంట్రాక్టరు తనమీాద లక్ష్మణదాసు 'జబర్దస్తీ' చేసినాఁడని కేసుపెట్టినాఁడు. పట్టు దలలు పెరిగినవి. లక్ష్మణదాసునొద్ద వకాల్తపుచ్చుకొని ప్రకాశము వాదింప మొదలుపెట్టెను. పోలీసులకుఁ బట్టుదల హెచ్చినది. సబ్కలెక్టరునొద్ద కేసు నడచుచున్నది. అధికారి ఐ. సి. యస్. ఉద్యోగి పార్సీవాఁడు. అతనికి 'ముద్దాయిని' శిక్షింపవలయునను నభిప్రాయము తొలుతనే స్థిరపడిపోయినది. అది కనిపెట్టి ప్రకాశ మతఁడు కేసు విచారింపఁదగఁడని హైకో ర్టులో పిటిషనులపై పిటిషనులు పెట్టెను. తుదకది రాజ మహేంద్రవరపు జిల్లాజడ్జికడ విచారణకు వచ్చెను. ఆ జడ్జియు

విచారించి శిక్షించెను. అంతటితో నిరుత్సాహపడక ప్రకాశము హైకోర్టుకుఁబోయి యాశిక్ష రద్దుచేయించెను. దానితోఁ బ్రకాశము ప్రతిభ తెలుఁగు మాగాణమునం దంతట వెలుఁగఁ జొచ్చెను. 'యాచకో యాచకశ్శత్రుః' అన్నట్లు పెద్దప్లీడరు లందఱికిఁ బ్రకాశముమీఁద అసూయాద్వేషములు రేకెత్తెను. రాజమహేంద్రవరపు వకీళ్ళు ప్రకాశముపైని కక్ష సాధింపఁ దలఁపెట్టిరి.

పురపాలక (మునిసిపల్) రాజకీయాలు

ప్రకాశము పెద్ద ప్లీడరులు పాతికరూపాయలు పుచ్చుకొనెడు కేసులో నూఱురూపాయల 'ఫీజు' పుచ్చుకొనుచు రెండు చేతుల డబ్బు సంపాదించుచుండెను.

రాజమహేంద్రవరపు పురపాలకసంఘము(మునిసిపాలిటీ) యావదాంధ్రదేశమునకు మొట్టమొదటిది. ఆ రోజులలోనే ఏఁడాది కేఁబదివేలరూపాయలుపైగా రాబడిగలిగియుండెడిది.

కాలేజి ప్రొఫెసర్లు రెవిన్యూ ఉద్యోగస్థులు దానికి అధ్యక్షులుగా నుండుచువచ్చిరి. అధికారేతరాధ్యక్షులలో ఏలూరి లక్ష్మీనరసింహము మొదటివాఁడు. ఆతఁడానాఁటికి రాజమహేంద్రవరమునకు కిరీటిములేని చక్రవర్తి. ఆతని నెట్లైన నోడింపవలెనని న్యాయపతి సుబ్బారావుపంతులు, ములుకుట్ల అచ్యుతరామయ్య, నేతి సోమయాజులు మొదలగు ప్రముఖులు విశ్వప్రయత్నము చేయుచున్నారు.

ఆంధ్రభీష్మ న్యాయపతి సుబ్బారావుగారు తెరచాటున నుండి లక్ష్మీనరసింహముగారిని బడఁగొట్టుటకు నెన్నియోపన్ను గడలు పన్నిరి. పత్త్రికల కెక్కించిరి. దానితో నరసింహము గారు విసిగి వేసారి నిడమర్తి దుర్గయ్యగారిని దమస్థానమున

నిలిపి తాను తప్పుకొనెను. నాఁటి పురపాలక రాజకీయములలో ఘనుఁడు రాయప్రూడి సుబ్బారాయఁడను వైశ్యప్రముఖుఁడు. అతని సాయముతోడనే దుర్గయ్యగారు చిరకాలము పురపాలక సంఘాధ్యక్షుఁడుగా నిలిచి పాలిచెను. నేతి సోమయాజులు మొదలగువారెంత ప్రయత్నించినను దుర్గయ్యగారి నోడించ లేకపోయిరి. కారణము: దుర్గయ్యగారికి సుబ్బారాయని బల ముండుట చేతనే. తన కింత సాయము చేసినను, పరిపాలనలో సుబ్బారాయని జోక్యమును దుర్గయ్యగారు దరికిఁ జేరనీయ లేదు. సహింపలేదు. దానితో వారిద్దఱికి వైమనస్యము లేర్పడినవి. సుబ్బారాయని దృష్టి ప్రకాశముమీఁదఁ బడినది. ప్రకాశము బి. ఏ. పూర్తిచేసికొని ఫస్టుగ్రేడు ప్లీడరుకావలె నను తలంపులోఁ బడి బి. ఏ. భాగాలుగా విజయము గాంచఁ దలఁచి ముందుగాఁ దెలుఁగునకు హాజరయ్యెను: కాని పుర పాలక వ్యవహారాలవలనఁ జదువు సాగలేదు.

అప్పు డేటేఁట ఎన్నికలు జరిగెడివి. ౧౮౯౬ లో మొట్టమొదటగా ప్రకాశము పురపాలకసభ్యుఁడుగా నిలఁబడుట యోడిపోవుట కూడ జరిగినది. ౯౭, ౯౮ సంవత్సరాలు రెండేండ్లుగూడవరుసగాఁ బ్రకాశము దుర్గయ్యగారిచే నోడింపఁ బడినాడు. తుదకు ౧౮౯౯ లో విజయము గాంచెను. అది మొదలుకొని ప్రకాశము ప్రతియేఁట దుర్గయ్యగారి యభ్యర్థుల నోడించుచునేయుండెను. దుర్గయ్యగారు తనకు లాభములేదని తప్పుకొన్నారు. ఏలూరి లక్ష్మీనరసింహముగారు సిద్ధపడినారు. ప్రకాశమువారిని గురుభావముతో నిలువవలదని చెప్పెను. కాని యాతఁడది పెడచెవినిబెట్టి, ప్రయత్నించి ప్రయత్నించి

తుదకుఁ దనకు లాభము లేదని నిశ్చయించుకొని, రైస్ అను సబ్‌కలెక్టరు నెగఁద్రోసి నిలువఁ బెట్టెను.

అమాయకుఁడగు రైస్ సరేయని సిద్ధమయ్యెను. ప్రకాశముదగ్గఱకొక రాయబారినిఁ బంపి 'వోటు' తనకీయ వలసినదిగా నర్థించినాఁడు. ప్రకాశము మొగమోటము విడిచి "నా వోటే కాదు నాకంఠములోఁ బ్రాణముండఁగా 'రైస్' అధ్యక్షుఁడు కాకుండ నా సర్వశక్తులు వినియోగించెదను. ఇది యుద్యోగేతరులకై యేర్పడిన పదవి. రైస్ దీనికి సిద్ధపడుట తగదనియు న్యాయవిరుద్ధమనియు నా మాటగాఁ జెప్పుఁడి" అని చెప్పి పంపెను.

ప్రకాశమున కప్పటికిఁ బట్టుమనిన నిరువదియేడేండ్లు నిండలేదు. ఆ చిన్నవయస్సున తా నధ్యక్షపదవికిఁ నిలువఁ దగనని యెంచి మోచర్ల రామచంద్రరావుగారిని బ్రోత్సహించి నిలువఁబెట్టెను. రైసు ప్రచారము జోరయ్యెను. అధికార బలమంతయు రైసుపయోగించి వర్తకసభ్యులను దన వంకఁ ద్రిప్పుకొన నారంభించెను. నయమున భయమున వర్తకుల కొత్తిడికలిగింప మొదలిడుటచే వర్తకులు మెత్తఁబడి రైసువంక మ్రొగ్గ మొదలిడిరి.

ప్రకాశము రామచంద్రరావుగారిని రైసు దర్శనానికి బంపెను. రైస్ దర్శనమీయ నిరాకరించెను. రామచంద్రరావుగారు నిస్పృహతోఁ దిరిగివచ్చెను. సరేయని ప్రకాశము రైసుచేసిన పురపాలకసభకుఁ దన పక్షము సభ్యులనందఱిని దోడుకొని వెడలి యొక కంట్రాక్టు వ్యవహారములో నూపిరాడకుండఁ బ్రశ్నపరంపరలు గురిపించెను. చర్చ శ్రుతిమించి రాగమునఁ బడినది. సభ ముగియగానే రైస్ ప్రకాశము నొకసారి

తనయింటికి వచ్చి కలసికొనుమనెను. ప్రకాశమట్లే కావించెను. రైన్‌తోఁ బ్రకాశము: "ఏమయ్యా! మీరుద్యోగులు. తాత్కాలికాధ్యక్షులు. మీ యధికారబలముతో నిలువఁజూడకుఁడు. రిప్పన్ ప్రభువుచేసిన పురపాలక శాసనము చొప్పున ఉద్యోగు లీ పురపాలక సంఘాధ్యక్షులుకారాదు. పరిపాలింపరాదు. మీరు ఏలూరి లక్ష్మీనరసింహముగారి ప్రోత్సాహముచే వారి వలలోఁబడి నిలువనెంచినారు. మీరు కాదుకూడదని నిలిచిరేని మా పక్షమువారము మిమ్ము ఓడించి తీరెదము. ఇవియుత్తమాటలు గావు. సత్యములు." అని కుండపగులఁగొట్టినట్లు చెప్పెను. దానికి రైన్‌కు తల తిరిగిపోయెను. వెంటనే "ప్రకాశము గారూ! ఇఁక నేను లక్ష్మీనరసింహముగారి వలఁబడను. రేపు రామచంద్రరావుగారిని రమ్మనుఁడు. కలెక్టరుకు నా నామినేషను నుపసంహరించుకొనునట్లు వ్రాసియిత్తు"ననెను. ప్రకాశము రామచంద్రరావుగారిని రైన్ దగ్గఱ కంపెను. అతఁడు చెప్పినట్లు చేసెను. రామచంద్రరావు పోటీలేకుండ నధ్యక్షుఁడయ్యెను. కాని రామచంద్రరావు శుద్ధమితవాది యగుట చేఁతను బ్రతిపని కలెక్టరునడిగి చేయుచుండుట చేతను అనతి కాలములోనే రామచంద్రరావు ప్రజలసానుభూతిని గోలుపోయెను. అది కారణముగా నతఁడు తన పదవినుండి తప్పుకొనెను. సభ్యులందఱు ప్రకాశమును నిలువఁబడుమన్నారు. న్యాయపతి సుబ్బారావుగారి కది గిట్టలేదు. నాఁటి యాంగ్లేయోద్యోగునితోపా టందఱు ప్రకాశమున కెదురు తిరిగినారు. కుడిభుజమైన రాయప్రోడి సుబ్బారాయఁడు వైశ్యునిగూడ ధనాశపెట్టి త్రిప్పుకొనఁ జూచినారు. చంకలెగురవైచినారు. బ్యాలెటుకూడఁ బెట్టించినారు. జిల్లాజడ్జి, సబ్ కలెక్టరు లిద్దఱు సభకు హాజరుకాలేదు.

ప్రతికక్షియగు ములుకుట్ల అచ్యుతరామయ్య ఓడి పోయెను. ప్రకాశము గెలిచెను.

రాజమహేంద్రవరములోని పెద్దలందఱి గొంతుకల లోను బచ్చి వెలఁగకాయపడిన ట్లయ్యెను. ప్రకాశము ఎన్నిక గజెట్ కాకుండ విశ్వప్రయత్నముచేసినారు. సుబ్బారావు గారు, పిటీషన్ లెనోన్ని యిప్పించెను. గవర్నరు రాజమహేంద్ర వరమునకు రాఁగా ప్రకాశమును స్వాగత పత్రము చదువ కుండఁజేసి కూర్మ వెంకటరెడ్డినాయఁడుగారిచేఁ జదివించిరి. ములుకుట్ల అచ్యుతరామయ్య తెల్లకాగితాలపైఁ గొంద ఱమాయికులచే సంతకాలుచేయించి, వానిపైని ప్రకాశము నకు వ్యతిరేకమైన విషయాలు నింపి ప్రభుత్వమునకుఁ పంపెను. ప్రకాశమది విని ప్రభుత్వమునకు నిజస్థితిని దెలుపుచు తంతి యిచ్చెను. ప్రభుత్వపు కాగితము కలెక్టరుకు వచ్చెను. అతఁడు 'పిటీషన్ల' లోని విషయములు రుజువు కాలేదు. కాని ప్రకా శము ప్రభుత్వమునకు ప్రతికూలుఁడు, స్వతంత్రుఁడు. కాన గజెట్ చేయరాదని వ్రాసి పంపెను.

ప్రకాశము మదరాసు వెడలి హెూర్బ్బును జూడ నెంచెను. ఎన్నాళ్ళు నిరీక్షించిన నా దొరగారి దర్శనము కాలేదు. తుదకుఁ బ్రాణము విసిగినది. 'పదునైదు రోజుల నుండి దర్శనార్థము నిరీక్షించుచున్నాను. దర్శనమిచ్చెడిది లేనిది తెలుపుఁడని ప్రకాశము వ్రాసిపంపెను. ఆ దొర తన యుపేక్షను మన్నించుమని కూనూరు వెడలి వచ్చిన తరువాత దప్పక దర్శన మిచ్చెద'నని బదులు వ్రాసిపంపెను. కూనూరు నుండి తిరిగి రాఁగానే హెూర్బ్బును కలిసికొనెను. ఈలోఁగా సుబ్బారావు గారు, రాజమహేంద్రవరపు కలెక్టరు గూడ

హెర్బ్సును గలిసికొని ప్రకాశముపైని ఉన్నవి లేనివి యెన్నియో నూరిపోసిరి. '

హెర్బ్సు ప్రకాశమును జూచి,

' ప్రకాశమూ! నీకు రాజమహేంద్రవరములో ఇల్లే లేదంటగా!' అని ప్రశ్నించెను. వెంటనే ప్రకాశము రాజమహేంద్రవరమునకు ఘోఫెసరుగావచ్చిన ప్రతివాఁడు 'చైర్మన్' ఉద్యోగము చేయఁగా నేనెందులకుఁ జేయఁగూడదు. ఇంటి సంగతి మీకేల' యని యడ్డుప్రశ్న వేసెను. దానితో నతఁడు తెల్ల మొగమువైచెను. ప్రకాశము రాజమహేంద్రవరపు పరిస్థితులన్నియుఁ బూసగ్రుచ్చినట్లు వివరించి చెప్పి రిప్పన్ ప్రభువు పరిపాలన ప్రజలవశము చేయుటకై పురపాలకసంఘపు చట్టము నిర్మించెను. పరిపాలనకు సంబంధింపని కారణాలు కల్పించుకొని మీరు గెజెట్ చేయకుండ మాటాడు టెక్కడనైనఁగలదా? ఇది దారుణ విషయము కాదా? ఎప్పుడైన నిట్టివి విన్నారా. కన్నారా? జీతము బత్తెములేని యీ పని కింతరభస యేమిటి? ఆటంకమేమిటి? అని ప్రశ్నించెను.

అదివిని దొర నాకు పిటీషనువచ్చినట్లు నీ కెట్లు తెలిసినదని ప్రశ్నించెను. 'రాజమండ్రిలో మూలనున్న ముసలమ్మ కూడ ఈ పిటీషను సంగతులు చెప్పికొనుచున్నది. ఒక పురపాలకాధ్యక్షుని గూర్చిన విషయములు రిపోర్టు చేయుమని గ్రామమునసబుకు వ్రాయుటా! ఎంతవింత! అని ప్రకాశము జవాబుచెప్పినను, దానితో నా ప్రభుత్వకార్యదర్శి యులుకకుండఁ బలుకకుండ నూరకొని 'సరే జాగ్రత్తగాఁ జూచెదను లెండు' అని బదులుచెప్పెను. ప్రకాశ మంతటితో నాఁగక గవర్నరునుగూడ దర్శించి విషయమంతయుఁ జెప్పెను.

గవర్నరాశ్చర్యపడి యది తాను గలుగఁ జేసికొనే విషయము కాదనియు హెర్‌బ్సు జాగ్రత్తగా చూడఁగలఁడనియు జెప్పి పంపెను.

హేర్‌బ్సు కలెక్టరు రిపోర్టు తెప్పించిచూచి యది నమ్మక ప్రకాశముపేరు గెజెట్‌చేసెను. ప్రకాశము రాజమహేంద్రవర పురపాలకాధ్యక్షుఁ డయ్యెను. అదేప్రకాశము రాజకీయ జీవితములో నాంది.

అధికారములోఁ బ్రకాశ మొకమెట్టు పైకెక్కఁగానే యెదిరికక్ష్య వారి కసూయ రేకెత్తినది. ప్రకాశము పక్షము వారినిపట్టి పల్లార్పనెంచిరి. ప్రకాశము పక్షముననున్న ఆరాముధయ్యము అనునాయనమీఁద దొంగనేరము ఆరోపించి 'కేసు' పెట్టినారు. మేజిస్ట్రేటు పనిపట్టి పెద్దల సలహాలకుఁ జెవియొగ్గి ఆరాముధయ్యమునకు నూటయిరువది పేజీల జడ్జిమెంటువ్రాసి యారుNelala శిక్షవిధించెను. ప్రకాశము జడ్జిమెంటు పూర్తిగా కోర్టులోఁ జదువుమనిచెప్పి యొక 'జూనియర్‌ప్లీడరును నోట్సు' వ్రాయుమని చెప్పి తాను సబ్‌కలెక్టరు విస్‌దగ్గరకేగి యాకేసు సంగతి యంతయు విప్పి చెప్పి బెయిలార్డరు తెచ్చి కోర్టులోనికి వచ్చెను. మేజస్ట్రేటు ఇంకను తీర్పు చదువుచునే యుండెను. ప్రతికక్ష్యలోనివారు మహోత్సాహముతో నున్నారు. తీర్పు పూర్తిగాఁ జదువఁగానె ప్రకాశము సబ్‌కలెక్టరుదొర అర్డరు మేజస్ట్రేటు నెదుటఁ బెట్టఁగానే 'మేజస్ట్రేటు, ప్లీడర్లు-పార్టీలు' అందరు 'స్తబ్ధు'లై పోయినారు. అరాముధయ్యమునకు జైలు తప్పినది. కాని కక్షలు మఱి పెరిగిపోయినవి. ప్రకాశమును హత్యల'కు సంబంధించిన కేసులలోఁగూడ ఇరికించుటకుఁ బ్రయత్నించినారు. కాని ప్రకాశము తన సాహసముచే, వాద

నైపుణ్యముచే నెదిరికుట్రలు, వ్యూహములు భేదించుకొని ప్రకాశింపఁజొచ్చెను.

ఒక కేసులో ప్రకాశము మదరాసు వెడలి డాక్టరు స్వామినాథన్ అను బారిష్టరును ప్లీడరుగాఁబెట్టి హైకోర్టులో వాదించుమనెను. స్వామినాథన్ నోరు విప్పలేక పోయెను. హైకోర్టువారు కేసు కొట్టివేసినారు. ప్రకాశము వెంటనే ఏమండీ స్వామినాథన్‌గారూ! ఇదేమి బారిష్టరీయండి ? కేసు ఆర్గ్యుమెంటు చెప్పకుండనే డిస్మిసుచేయఁగా ఊరుకున్నారు' అని కేకలు పెట్టెను. పాప మాతఁడేమి చెప్పలేక ప్రకాశమును రాత్రికిఁ దనయింటికి విందునకుఁ బిలిచెను. ప్రకాశము వెడలెను. భోజన సమయములో స్వామినాథన్ ప్రకాశమును గాంచి 'ప్రకాశముగారు! మీరు చాల ధైర్యముగలవారివలె అగపడుచున్నారు. మీకు మంచి చురుకుఁ దనముకూడ నున్నది. ఎందులకు మీరు బారిష్టరు కాఁగూడదు' అని ప్రశ్నించెను.

ప్రకాశము "నేను పేదవాఁడను. సెంకండరీగ్రేడ్ ప్లీడరును. నాకేమిటి వేలకువేలు వ్యయమగు బారిష్టరీయేమిటి ? అదియెట్లు లభ్యమగును"–అనెను.

వెంటనే స్వామినాథన్ – ప్రకాశముగారూ! ఎంతో డబ్బక్కఱలేదు. ఆఱువేల రూపాయలతో కోర్సు అంతయుఁ బూర్తియగును. నేను నెలకాఱుపౌనులతోఁ గాలక్షేపము చేసినాను.' అని చెప్పెను. వెంటనే ప్రకాశమున కుత్సాహము రేకెత్తెను. 'అంత సులువైన నట్లే ప్రయత్నింతుననని' చెప్పి సెలవుతీసుకొని రాజమహేంద్రవరము వచ్చి ప్రాణమిత్రులైన కంచుమర్తి రామచంద్రరావుగారితో నావిషయము చెప్పెను.

ఆ మిత్రుడు మూడు వేలరూపాయలియ నంగీకరించెను. అర్ధణా కేసు గెల్చిన మాగంటి లక్ష్మణదాసుగారు మిగిలిన మూఁడు వేల రూపాయలు నిచ్చిరి. ప్రకాశ మానందపరవశుఁడై యింగ్లాండునకుఁ బోవ సమకట్టెను.

## ఇంగ్లండు ప్రయాణము

అప్పటికిఁ రాజమహేంద్రవరములోఁ బ్రకాశము సంసారము స్థిరపడినది. ప్రకాశము పని మూఁడు పూవులు ఆఱు కాయలుగా నున్నదని బంధువు లందరు సంతోషించుచున్నారు. ప్రకాశము ఇంగ్లాండు ప్రయాణము వారినందఱిని కలవరపెట్టినది. సముద్రయానము పనికిరాదను రోజులవి. తల్లి ప్రకాశమును లండను వెడలవలదని పట్టుపట్టెను. అది సహజమే కదా! ఆ తల్లి యష్టకష్టాలుపడి గట్టెక్కించిన కొడుకింత ప్రయోజకుఁడై పదిరూకలు తెచ్చుచు నందఱిని గడుపులోఁ జల్ల కదలకుండఁ బోషించువాఁడు సీమకేఁగిన యేమగునో తమగతియేమో యనికూడ నాయమ తత్తరపాటు చెందినది. దానికి సాయ మొక రాజమండ్రి బారిష్టరు ఒక దొరసానిని బెండ్లాడి నానావస్థలు పడుట, నిర్భాగ్యజీవితము గడుపుట కూడ బంధువర్గమువలన విని యామె ప్రకాశము ప్రయాణమునకుఁ దొలుత నంగీకరింపలేదు. కాని చివరకు సహజధైర్యయగుటచే నంగీకరించెను. ప్రకాశముచే మాంసము, చేపలు తిననని యొట్టు పెట్టించుకొనెను. సరే ప్రయాణము సిద్ధమయ్యెను. ప్రకాశము ఓడ నెక్కి తిన్నఁగా ఇంగ్లాండు చేరెను. నియమబద్ధమైన పాశ్చాత్యుల జీవిత విధానమును గాంచి ప్రకాశము మురిసిపోయెను. తన మాతృదేశమట్టి యున్నత స్థాయి కెన్నఁడు వచ్చునోకదా యని నిట్టూర్పు విడిచెను.

లండనులో ప్రకాశము చాలరోజులవరకు స్ట్రామీఁద వండుకొని తిని కాలక్షేపము చేయుచు బారిష్టరుచదువు మొదలు పెట్టెను. బారిష్టరనిన విందులుచేసి డిగ్రీలు తెచ్చుకొనెడి వారు మాత్రమే యని లోకములో వాడుకయైపోయినది. మన విశ్వ కళాపరిషత్తులో అట్టెండెన్సు ఎంతముఖ్యమో లండనులో బారిష్టరు చదువునకు విందు లంత ముఖ్యాతి ముఖ్యము.

ప్రకాశము కేవలము విందుల (డిన్నరు) బారిష్టరు కాడు. 'కౌన్సిల్ ఆఫ్ లీగలు ఎడ్యుకేషన్' వారేర్పాటుచేసిన యుపన్యాసాల కేగి యున్నతస్థాయిలోనుండు వాని సారాంశములన్నియు వ్రాసికొనుచు విశ్రాంతి సమయములలో ఆంగ్లన్యాయస్థానముల కేగి పరిశీలించియుఁ దన వెనుకటి న్యాయవాద జ్ఞానమునకు మెరుఁగుపెట్టుకొనెను. 'కోర్సు' మొదటి 'టరము' పూర్తి యగునప్పటికిఁ ప్రకాశము వ్రాసికొనిన 'నోట్సు' నిలువెత్తునఁ దయారయ్యెను. లండను జీవితము ప్రకాశమునకు నన్నివిధముల నభివృద్ధికిఁ కారణమే యయ్యెను.

## రాజకీయముల పరిచయము

లండనులోనే పరేఖ్ అను నొక పార్సీబారిష్టరు ప్రకాశమును 'లండన్ ఇండియన్ సొసైటీలో' సభ్యుడుగాఁ జేర్చెను. రాజకీయ స్వాతంత్ర్యము పైని కాంక్ష ప్రకాశమున కప్పుడే యుదయించెను.

ఆంగ్లేయులు పవిత్రభారతము నన్యాయముగా నాక్రమించుకొన్నారనియు మన జన్మభూమి స్వాతంత్ర్యముకొఱకు వంగదేశస్థులు విప్లవ కార్యములు సాగించు చున్నారనియుఁ

ప్రకాశము వినెను. వంగవిప్లవకారుల చర్యలుకూడ మన ప్రకాశమున కుత్సాహకారణములు కాఁజొచ్చెను.

లోకమాన్య బాలగంగాధర తిలక్ యొక్క స్వాతంత్ర్య పిపాస, రాండీహత్య, తిలక్ మహారాజుమీద 'కేసు' మున్నగు విషయము లెన్నో ప్రకాశము మనమున నాఁడే నాటికొని పోయెను.

తిలక్, గోఖలేల భేదాభిప్రాయములు, ఫిరోజిషా మెహతా ప్రతిభ, పంజాబు కేసరి లాలా లజపతిరాయి స్వదేశ స్వాతంత్ర్యకృషి, యాతఁడుపడు కష్టనష్టములు ప్రకాశమును బాగుగా నాకర్షించినవి.

అప్పటికి కాంగ్రెస్సుపుట్టి ౧౮.౧౯ ఏండ్లయ్యెను. అది దేశాభ్యుదయమునకై పాటుపడుచున్నదని తెలిసికొనెను. పశ్చిమదేశములో మహారాష్ట్ర భూభాగమున తిలక్ లోక మాన్యుఁడు, ఉత్తరదేశములో పంజాబు కేసరి లజపతిరాయి ప్రకాశమునకు రాజకీయరంగమున గురుతుల్యులైరి. వారి పోకడలు ప్రకాశము రాజకీయ జీవిత మార్గములో ముందడుగు వేయుటకుఁ బ్రోత్సాహ మిచ్చినవి.

దాదాభాయినౌరోజీవ్రాసిన'హిందూదేశదారిద్ర్యము' (ఇండియన్ పావర్టీ) అను గ్రంథము చదివి ప్రకాశము భార తీయుల దారిద్ర్యబాధకై మిక్కిలి విచారించెను. దరిద్రనారా యణుల నుద్ధరింపఁ దలపెట్టెను.

దాదాభాయి నౌరోజి కాంగ్రెసు స్థాపకులలో నొకఁడై హిందూదేశ నిజస్థితినిగూర్చి యాంగ్లప్రజల కెఱిఁగించుటకై యింగ్లాండున కేఁగి యచటఁ బనిచేసెను. ఆనాఁడు కాంగ్రెసు

సంఘములోఁ బెక్కుమంది యాంగ్లేయులుగూడనుండెడివారు. రమేశచంద్రదత్తు 'ఎకనామిక్ సర్వే ఆఫ్ ఇండియా' యను గ్రంథము వ్రాసెను. ప్రకాశ మది యామూలాగ్రముగఁ బఠించెను. అది చదువఁగానే ప్రకాశమునకు నాంగ్లపాలన యెడఁ బరిపూర్ణ విముఖత్వము, భారతస్వాతంత్ర్య సంపాదన యెడ సుదృఢ నిశ్చయభావము నేర్పడెను.

ప్రకాశము 'లండన్ ఇండియన్ అసోసియేషన్' లో సభ్యుఁడై ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా దేశములకై ప్రజా స్వామికమునకై ప్రజాస్వాతంత్ర్యమునకై జరిగిన పోరాటముల గూర్చిన గ్రంథము లెన్నియో యామూలాగ్రముగాఁ బఠించెను.

అంతలో దాదాభాయినౌరోజి పార్లమెంటు ఎన్నిక వచ్చినది. ఆ యెన్నికకై ప్రకాశము ప్రచారము సాగింప మొదలిడెను. ఆంగ్లేయులు, తెల్లవారు తెల్లవారికే ఓటీయ వలెనుగాని నల్లవానికి ఓటీయరాదని ప్రచారముచేసిరి.

ప్రకాశమున కేమియుఁ దోచలేదు. తమకు నాయకుఁడైన యొక యాంగ్లేయుని సలహా యడిగెను. 'ఆతఁ డింత మాత్రమునకే భయమేల ప్రకాశమూ! దాదాభాయి నల్లవాఁడైనచో నాతనిమీఁద బోటీ చేయువాఁడు తెల్లఁదనములో రంగుతగ్గిన జ్యూ. అందుచే సమర్థతనుబట్టి "ఓటీయుఁడు" అని ప్రచారము సాగింపుఁడని సలహా యిచ్చెను.

ప్రకాశము అదియాఁతఁగాగాని నౌరోజికిఁ బ్రచారము చేసెను. నౌరోజి గెలిచెను. పార్లమెంటు సభ్యుఁడయ్యెను. ప్రకాశమది తన విజయముగా సంతసించెను.

## బారిష్టరుచదువు పూర్తి - రాజమహేంద్రవర ప్రయాణము

ప్రకాశము స్వదేశమునకు బయలుదేఱుటకుముందొక విందు లండనులో జరిగినది. చెన్నపురిలోఁ బ్రధానోన్నత ప్రాడ్వివాకుఁడుగా (జడ్జి) నుండి మతములు, కులములు ధని కులు పేదలు అను తారతమ్యములేకుండ మేము న్యాయాధి పతులము న్యాయముగాఁ దీర్పు లిచ్చెదము. అని చెప్పిన ధీరుఁడు సర్ ఆర్థర్ కాలిన్సు ప్రకాశమునకు మాష్టరు.

బారువాదులు జరిగినపుడు చిన్నవాఁడగు విద్యార్థి భోజనానంతర మొకచిన్న యుపన్యాస మొసఁగి పొగత్రాగు టకు మాష్టరుయొక్క యనుమతిని పొందవలెను. ఇది యచ్చటి యనూచానాచారము.

నాఁటి విందులోఁ బ్రకాశమువంతు వచ్చినది. లేచి నిలిచి 'అయ్యా, సిగరెట్టు త్రాగి నేనిట్టి యుపన్యాసమీయను' అని ప్రకాశము చెప్పి యీ యాచారమును ధిక్కరించెను. అందున్నవారెల్లఁ దెల్లఁబోయినారు. కొందరు హూంకరించి నారు. కొందఱు చీదరించినారు. తలకోమాదిరిగా గుజగుజలు పోయినారు. కొందఱు చనవుగా దూషించినారుకూడ. ఏమైన నేమి మాష్టరు పిలిచి 'యేమిట్లు చేసినావు ప్రకాశమూ' యని ప్రశ్నించెను. ప్రకాశము నాకీ యాచారమిష్టము లేదు. ఇష్టము కానిపని చేయకుండనుండుటకు నాకుస్వాతంత్ర్యములేదా'యని యెదురు ప్రశ్నలు వేసెను. అదివిని యీ మాష్టరు చిఱునవ్వు నవ్వి, 'సరే ప్రకాశమూ! బల్లదగ్గఱకేగి కూర్చుండ' మనెను.

ఈరీతిగా మొదటినుండి ప్రకాశము తానునమ్మిన సత్యమునకై మొగమోటములేక కుండపగులఁగొట్టినట్టు

మాట్లాడు స్వాతంత్ర్యము నలవాటు చేసికొనెను. మొదటి టరము ఎనిమిది నెలలు చదువు ముగించుకొని రాజమహేంద్ర వరమునకు వచ్చెను. ప్రకాశము లోలుఁడై చెడిపోవునని తలంచినవారి కందఱికిఁ బ్రకాశము రాక యాశ్చర్యము కలిగించినది.

అప్పుడు రాజమహేంద్రవరమునఁ గందుకూరి వీరేశలింగముపంతులుగారి ప్రతిభ బాగుగా కాంతులీనుచున్నది. ప్రకాశమునకుఁ గొందఱు మిత్రులు విందులు చేసినారు. కొందఱు అసూయాగ్రస్తులై వెలివేయవలెనని యత్నించినారు. శంకర పీఠాధిపతులైన రాణీచయనులు స్వాములవారిచే 'సముద్ర యానము హిందూమత విరుద్ధము కావున నీవు ప్రాయశ్చిత్తము చేసికొననిదే హిందూసంఘములోఁ గలియరా'దని యొక శ్రీముఖము బ్రకాశమున కిప్పించిరి. ప్రకాశమా దానికి వెఱచువాఁడు ?

ప్రకాశము వాని సహచరులు స్వాములవారి యాజ్ఞను దృణీకరించుటయేకాక యాస్వామిని ననేకములైన యడ్డు ప్రశ్నలువేసి యెదురుతిరిగిరి. దానితో స్వాములవారుఁ బ్రతుకు జీవుఁడా యని తిరిగి వెడలిపోయెను. పాపము స్వాములవారిని దెరమీఁది కెక్కించినవారందరు సిగ్గుపడిరి.

ప్రకాశము ఇంగ్లాండు వెడలునప్పటికి పోతునూరులో చెలసాని పట్టాభిరామయ్యగారి భార్య రామమ్మ యాస్తిని (మాగంటి బాపినీడుగారి అక్క) దాయాదు లక్రమముగా భుజబలముతో నాక్రమించుకున్నారు. ఆమెయొద్ద కానిలేదు. ఆ కేసు ప్రకాశము తిరిగివచ్చుదాఁక నడచుచున్నది. అది భుజమునవైచికొని ప్రకాశము నెగ్గించెను. అది పదిలక్షుల

రూపాయలు విలువగల యాస్తి. కావున రామమ్మగారు సంతోషించి ప్రకాశమున కొక్కమాటుగా డెబ్బదివేల రూపాయలు 'ఫీజుగా' పారితోషిక మిచ్చెను.

మఱల యింగ్లండు ప్రయాణము

ప్రకాశము రెండవ మాఱు లండనుజేరెను. అచ్చట న్యాయశాస్త్రోపన్యాసములన్నియు శ్రద్ధతో విని విషయములు పరిపూర్తిగా నాకళింపుచేసికొనుచుండెను.

ఆ రోజులలోనే ప్రకాశము ఇంగ్లండులోనున్న ముఖ్య పట్టణములన్నియుఁజూచి యందలి పారిశ్రామిక స్థలములను గూడ వీక్షించెను. కట్టమంచి రామలింగారెడ్డిగా రప్పుడు కేంబ్రిడ్జిలో బారిష్టరు పరీక్షకుఁ జదువుచుండెను. ప్రకాశము వారిని గలిసికొనెను. రెడ్డి బారిష్టరు పరీక్షకుఁ జదివి విందుల పొందులన్నియుఁ జవిచూచి, తుదకు గోక్లే 'సలహా' విని పరీక్షకు వెడలుట మానివైచెను. ఇరువురు కొంతసేపు తెలుఁగు భారతమునుగూర్చి ముచ్చటించుకొన్నారు.

ఆ కాలములోనే మద్రాసు ఉన్నతన్యాయస్థానములో న్యాయాధికారిగాఁ బనిచేసిన షెప్పరుతోఁ బ్రకాశమునకుఁ బరిచయముకలిగెను. అప్పు డాతఁడు 'ఇండియన్ కంట్రాక్టు ఆక్టు' అనే 'లా' పుస్తకము మార్చి తీర్చి వ్రాయుచుండెను. దానికి సాయపడవలసినదిగాఁ బ్రకాశమును నతఁ డర్థించెను. ప్రకాశము అప్పటికే పదేండ్లనుండి ప్లీడరీలోననుభవమున్న వాఁడగుట నతనికిఁదృప్తికలుగునట్లుగాఁ బనియంతయుఁజేసిపట్టెను.

లాలో 'సర్టిఫికెట్ ఆఫ్ ఆనరు' సంపాదింపవలయునన్నిన నూటికి డెబ్బదియైదు 'మార్కులు' రావలెను. ఆ గౌర

వము మన ప్రకాశము దక్కించుకొనెను. ఏఁబది 'పౌనులు' బహుమానముకూడ బడయఁగలిగెను. ఆ నాఁడే యూరప్ యాత్రకూడఁ బ్రకాశము జేసెను. ప్రకాశ మిట్లు తృతీయశ్రేణిలో బారిష్టరు పరీక్షలో విజయముగాంచి పదివేలరూపాయలు వెల గల 'లా' పుస్తకములుకొని ౧౯౦౬ సంవత్సరాంతమునకుఁ జెన్నపురిచేరి కొండిసెట్టి వీధిలో ౨౫ రూపాయల కొక చిన్న యిల్లు కుదుర్చుకొనెను.

## బారిష్టరు వృత్తి

చెన్నపట్టణములో న్యాయవాదిగాఁ బేరుగాంచుట సామాన్యవిషయము గాదు. తమిళ న్యాయవాదులందఱు మహామేధావులు. వారిముందు బారిష్టరు ప్రకాశము రాణించు టెట్లు? ప్రకాశించుటెట్లు? మిత్రులందరు ప్రకాశమును నిరు త్సాహపఱచినవారే. పెద్ద పెద్ద దొరలే తమిళ న్యాయ వాదులముందు దాఁగలేక చెన్నపురివీడి వెడలిపోవుచుండిరి.

అట్టి స్థితిలో ౧౯౦౭ వ సంవత్సరములో మదరాసులో న్యాయవాదవృత్తి కారంభముచేసి బదునాలుగేండ్లేకధాటిని బ్రకాశము తన వృత్తిలో మిక్కిలి ప్రకాశించెను. వేనవేలు రూపాయలార్జించెను. భోగభాగ్యాలతోఁ దులఁదూఁగెను. తెలుఁగు నాట నేమూడ గాంచినను బ్రకాశము పేరు మ్రోఁగి పోవుచుండెను. ఇరువదివేల రూపాయల యప్పు తీర్చివేసెను.

ఆత్మవిశ్వాసము, నిర్భయత్వము, పరిశ్రమతనకూఁతఁగాఁ బ్రకాశము న్యాయవాదిగాఁ బేరుగాంచెను. హిందూలాను గూర్చి పుస్తకము వ్రాసిన జాన్-డి-మెయిన్ అంతటివాఁడు తన

పుస్తకములో మదరాసు బారిష్టరులలోఁ బ్రకాశమువలె 'సివిల్ ప్రాక్టీసు' సంపాదించినవా రెవ్వరును లేరని ప్రశంసించెను.

న్యాయాధికారులు పరాకుగానున్నపుడుగాని, చిరాకుగా నున్నపుడుగాని ప్రకాశము సహించి యూరకొనువాఁడుకాఁడు. ఒకప్పుడు 'వాలస్' అను న్యాయాధికారి నిద్రపోవుచుండఁగా ప్రకాశము వానిని అదల్చి యెదిర్చెను. అప్పటినుండి యాతఁ డెన్నఁడు న్యాయస్థానములో గునికిపాట్లుపోలేదు. మఱొకప్పుడు 'నేపియర్' అను న్యాయాధికారి యొక వ్యాజ్యెములో 'ప్రకాశమూ!' నీవు చెప్ప దలఁచిన దంతయుఁ బదినిమిషము లలో ముగించవలయు నన్నాఁడు. వెంటనే ప్రకాశము ముఖ్య విషయము చెప్పుటకే చాలద నెను. అతఁడు వెంటనే చుఱ్ఱు మని 'చాలు సోదె కట్టిపెట్టండి' అన్నాఁడు. తోడనే ప్రకాశము న్యాయాధిపతిని గాంచి ఆ మాట యుపసంహరించు కొనినఁగాని తాను న్యాయస్థానములో 'ఆర్గుమెంటు' చెప్పు టకు నిరాకరించుచున్నానని బల్లగ్రుద్ది చెప్పెను. దొర మొగము జేవురించుకొని వెడలిపోయెను. ప్రకాశమది న్యాయవాది సంఘములోఁ బెట్టి దొర చర్చకు గర్హించుచుఁ దీర్మానము చేయించెను. తుదకు దొర ప్రకాశమునకు క్షమార్పణము చెప్పెను.

ఈ రీతిగాఁ బ్రకాశము స్వతంత్ర భావపూరితుఁడై యీ వృత్తిలో వెలుగొంది మద్రాసులోను, నీలగిరిలోను, ఒంగోలులోను, రాజమహేంద్రవరములోను దివ్యభవనాలు కట్టించెను. రెండు లక్షల రూపాయలు స్థిరమైన యాస్తిని గూడ సంపాదించెను. ఇంటిల్లిపాది ప్రకాశము సంపాదనతో సమస్త భోగా లనుభవించుచుండిరి.

తా నింతవాఁడు కావుటకుఁ గారణభూతుఁడైన హను మంతరావు నాయఁడుగారిని దనయొద్దనేయుండుమని పోషించి గురుభక్తిని సంపూర్ణముగాఁ గృతజ్ఞతా పూర్వకముగాఁ బ్రకటించుకొనెను. నాయఁడుగారుగూడఁ బ్రకాశము తన యెడఁ జూపిన యాదరమునకు నభిమానమునకు సంతృప్తి గాంచెను.

## రాజకీయ జీవితము

హనుమంతరావుగారి శుశ్రూష, వీరేశలింగముగారి సంస్కరణోద్యమము ప్రకాశమునకు రాజకీయాభిలాషలు పెంపొందుట కాది కారణము లాయెను.

'స్వరాజ్యము' అను పద ముచ్చరించుటే, యపరాధ ముగా నెంచు రోజులవి. అప్పుడే ప్రకాశము తనకు రాజకీయ గురువుగా నెంచుకొనుచున్న లోకమాన్య బాలగంగాధరతిల కును పూనానగరమున కేఁగి దర్శించెను. తిలకు ప్రకాశమునకు రాజకీయముతోపాటు హిందూమతముల సూత్రములఁ గూడఁ జక్కఁగ వివరించి చెప్పెను. నాఁడు ప్రకాశము తిలకుబోధల లోని హిందూమతతత్త్వమును నాకళింపుచేసికొనలేకపోయెను. కాని పిమ్మటఁ దెలిసికొనఁ గలిగెను. కాంగ్రెసులో తిలకు, లజపతిరాయి మున్నగువా రతివాదులు. మెహతా, గోక్లే, సురేంద్రనాథ బెనర్జీ మున్నగువారు మితవాదులు. సూరతు కాంగ్రెసులో ఇరువాఁగుల వారికి చాల వివాదాలు చెలరేఁగి నవి. ప్రకాశము ఆ యా కాంగ్రెసుసభలకు వెడలి వచ్చుచు నుండెను. కాని విశేషముగా నప్పటికి రాజకీయ రంగములో దుమకలేదు.

అనిబిసెంటు 'హోంరూలు' ఉద్యమము లేవఁదీసెను. అది ప్రజల నాకర్షించినది. తిలకు స్వరాజ్యోద్యమమునకు నాయకుఁడై నిలచెను. నాఁటి యాంగ్లప్రభుత్వ మా మహారాజునకు ౧౯౦౮ సంవత్సరములో ఆఱేండ్ల కారాగారశిక్ష విధించినది. అతఁడు మండలే జయిలులో మ్రగ్గుచుండెను. దానితో ౧౯౧౪ సంవత్సరములో మరల నూతన జాతీయ వికాసము దేశమంతటఁగలిగినది. ప్రభుత్వమువారి నిరంకుశత్వమునకుఁ బ్రజానాయకులు చాలమందికంటగించుకొన జొచ్చిరి. ప్రచండమైన ప్రపంచయుద్ధము వచ్చినది. అదే సమయములో బిసెంటు లేవదీసిన మహోద్యమము ప్రకాశమును బాగుగా నాకర్షించినది. అప్పుడే లోకమాన్య బాలగంగాధర తిలకు జైలునుండివచ్చి తీవ్రరాజకీయాందోళన సాగించదొడఁగెను. బిసెంటు 'న్యూ ఇండియా' పత్రికద్వారాను 'హోంరూలు లీగు' ద్వారాను భారతదేశ స్వాతంత్ర్యమునకై పాటుపడ నారంభించెను. ఈరీతిగా భారతదేశము స్వాతంత్ర్యోద్యమము ప్రారంభమయ్యెను. ౧౯౧౯ లో గాంధీమహాత్ముడు సత్యాగ్రహ ప్రమాణములు చేయింప మొదలిడెను. ప్రకాశము సత్యాగ్రహపత్రముపై వ్రాలుచేసెను.

౧౯౨౦లో కలకత్తాలో కాంగ్రెసుమహాసభ జరిగినది. బిసెంటు సభకధ్యక్షురాలు. ప్రకాశ మా సభావిషయములలోఁ బాల్గొనెను. అప్పుడే చిత్తరంజనదాసు రాజకీయరంగములోఁ బ్రవేశించెను. అతఁడు చాలతీవ్రవాది. అతని నాయకత్వము దినదినాభివృద్ధిచెంది మహావక్తయని పేరు గాంచిన సురేంద్రనాథబెనర్జీ యంతటివానిని ద్రోసిరాజు చేసినది. కలకత్తా కాంగ్రెసుకు గాంధికూడ వచ్చెను. అహింసాసత్యాగ్రహ

సిద్ధాంతములను వివరించెను. ఆ సిద్ధాంతము ప్రకాశమును పూర్తిగా ఆకర్షించినది. గాంధిశిష్యుఁడయ్యెను. ౧౯౨౧ అక్టోబరు ౨౯ వ తేదీని స్వరాజ్య సంపాదనార్థమై 'స్వరాజ్య పత్రిక స్థాపించెను. ఆ పత్రిక నిర్భయముగా స్వరాజ్యసంపాద నార్థము ప్రభుత్వమును ధిక్కరింపసాగెను. ప్రజలలో నూతన చైతన్య మంకురించినది.

నాగపూరులో జరిగిన కాంగ్రెసుమహాసభలో ప్రజలు న్యాయస్థానములు, పాఠశాలలు, కళాశాలలు, శాసనసభలు బహిష్కరింపవలయునని తీర్మానింపఁబడెను. వెంటనే ప్రకాశము తన న్యాయవాదవృత్తికి తిలోదకాలిచ్చి యసహాయ మహోద్యమాగ్నిలో నుఱికెను.

రాజగోపాలాచార్యులు తన కండదండ కాఁగాస్వరాజ్య పత్రికను ఇంగ్లీషులోనేగాక అరవము, తెలుఁగు భాషలలోఁ గూడఁబ్రకటించి ప్రకాశము కాంగ్రెసుప్రబోధము దక్షిణదేశ మునం దెల్లెడలఁ గావించెను, తనకున్న సర్వస్వము దేశ హితార్థము వ్యయపఱచి నిర్ధనుఁడయ్యెను. సైమన్ కమీషను వచ్చినపుడు మద్రాసులో బ్రిటీషు పటాలములకు ఱొమ్ముచ్చి తుపాకులతోఁ గాల్చుఁడని యెదిర్చి యదల్చెను. ఆంధ్ర కేసరి సింహగర్జనమునకుఁ దెల్లసిపాయిలు తెల్లమొగములువైచి తుపాకులు ప్రేల్చలేకపోయిరి. దానితో ఆంధ్ర కేసరి ప్రతిభ యావద్భారత దేశమున మారుమూలలయందుఁ గూడ మ్రోగిపోయెను. దేశసేవా నిమగ్నుఁడై నిరంతర ప్రజాసేవ చేయుచున్న ప్రకాశము పెక్కుమారులు బ్రిటిషువారి యతిథిగాఁ గారాగృహము నలంకరించెను. తన ధనమును, బుద్ధిని, శక్తిని, ప్రజ్ఞను, ఉపజ్ఞను సాహసమును ఇదియది

యననేల తన సర్వస్వమును దేశహితార్థ మర్పించి దరిద్ర నారాయణుఁ డయ్యెను. చేతిలోఁ జిల్లిగవ్వ లేదు. కాని కోటికిఁ కొదువలేదు. ఉండుటకు 'నాది' యను గృహముకూడ లేదు. అన్ని మేడలు అన్ని వసతులు, అన్ని వృత్తులు దేశసేవ కర్పించెను. భారతదేశమునకు స్వతంత్రము లభించినది.

తొలుత రాజగోపాలాచార్యుల ముఖ్యమంత్రిత్వముతో మద్రాసు రాష్ట్రమునకు రెవిన్యూమంత్రియై ప్రకాశము తన ప్రజలకు నపారసేవచేసెను. పిమ్మటఁ దానే మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రియై 'కొనుగోలు' పరపతిసంఘములు మొదలగు పెక్కు ప్రజోపకార సంస్థలు నెలకొలిపెను. ఏఁడాదిపాటు ముఖ్యమంత్రిత్వము నెరిపి రాజకీయ కల్లోలమునకు లోనై యాపదవి విడిచిపుచ్చి, కాంగ్రెసునుండి విడివడి, 'ప్రజా' పార్టీని స్థాపించి దానికిఁ దానధినేతయై,ఒయోజనుల "ఓటింగు" పై జరిగిన యెన్నికలలోఁ దన 'పార్టీ' వారిని ఆంధ్రదేశపు టన్ని నియోజకవర్గములలోను నిలిపి యతిరథమహారథులని పేరుపడ్డ పెక్కుమంది కాంగ్రెసు మహాయోధులను తన ప్రజా పార్టీ యోధులచే ఓడించెను. తాను మరల ముఖ్యమంత్రి కావుటకై యితర రాజకీయవర్గములతోఁ జేయిచేయికలిపెను. రాజాగోపాలాచార్యులపై ననేక విధముల యొత్తిడులు తెచ్చి యతఁడు ముఖ్యమంత్రి కాకుండ నుండుటకై ప్రయత్నించెను. కాని శ్రమ ఫలింపలేదు.

పిమ్మట మహానుభావుఁడు, స్వార్థత్యాగి, అమరజీవియైన పొట్టి శ్రీరాములు లాంధ్రరాష్ట్రమునకై ప్రాణము లర్పించెను. ౧౯౫౩ అక్టోబరు ౧వ తేదీని ఆంధ్రరాష్ట్ర మవతరించినది.

భారతప్రధాని నెహ్రూ, మదరాసు ముఖ్యమంత్రి రాజ గోపాలాచార్యులు, హైదరాబాదు ముఖ్యమంత్రి బూర్గుల రామకృష్ణారావు ప్రభృతులు తన చెంత నాసీనులుకాఁగా అమృత మూర్తియైన ప్రకాశము మన నూతనాంధ్రరాష్ట్రము నకుఁ బ్రథమ ముఖ్యమంత్రియై వెలుఁగొందెను. ఆత్మ దేశమునకై తానుచేసిన త్యాగమునకై బ్రకాశమును ప్రజలర్పించినారు. మధ్యలో సృష్టించిన ప్రాజాపార్టీని విడిచి పుచ్చి ప్రకాశము తన తల్లి సంస్థయైన కాంగ్రెస్‌లో మఱల చేరెను.

కాంగ్రెసు ప్రముఖులును సుస్వాగత మొసంగి ప్రకాశ మునకు బ్రహ్మరథము పట్టినారు. ప్రకాశమంతట తన శక్తి కొలఁది కాంగ్రెసును పటిష్టముచేయ కృషి సల్పుచుండెను.

ఇంతలో నాయకమ్మన్యులలో ఆంధ్రమును, తెలం గాణమును కలిపి విశాలాంధ్ర రాష్ట్రముగా నొనర్పవలెనని కోరిక లీరికలెత్తి తెలంగాణ నాయకులతో సంప్రతింపులు జరుప నారంభించిరి. మన ప్రకాశము సంప్రదింపులలో ముఖ్యపాత్రవహించి, తెలంగాణము వారి నొడంబడునట్లుచేసి శ్రీ నీలం సంజీవరెడ్డిని ఆంధ్రప్రదేశము (తెలంగాణము - ఆంధ్రము కలసిన రాష్ట్రము) నకు ముఖ్యమంత్రియగుటకు సాయపడి, తాను, అమాత్యపదవినుంచి వైదొలగెను.

విదేశమిత్రులయు, నాయకులయు ఆహ్వానములపై విదేశయాత్ర గావింపదలఁచెను గాని వయోవృద్ధత్వ మాటం కము కాగా కదలలేని పరిస్థితిలో హైదరాబాదుననే నివాస మేర్పరచుకొనెను.

అఖిలాంధ్రమున ఆ బాల గోపాలముచే మన్ననలందిన మనీషి – అఖిల భారత రాజకీయోద్యమములలో నడుము బిగించి ముందడుగు వేసి జయభేరి మ్రోగించిన సాహసుడు, అకుంఠిత గుణోపేతుఁడు – ఆత్మవిశ్వాస ప్రజ్ఞాధిషణుడు కాల పురుషుని వృద్ధత్వపుటురులలో దగుల్కొనినాడు. కాలుకదుప లేదు. కనులు తెరువలేదు. నోటమాటలేదు. ఆంధ్రమాత తనయునుంగు పుత్రుని దివ్య జీవితమును తన హృదయాంక మున జేర్చుకొన్నది. మూడుకోట్ల యాంధ్రుల కాక్షణము అమవసనిశి.

మంత్రి సామంత్రులు, ప్రజానాయకులు ప్రజలు వెంట నడువ, మంగళతూర్యారావములు మిన్నుముట్ట, రాజలాంఛనములతో నుత్సవముగాఖింపబడిన యనంతరము ప్రకాశము పంతులు భౌతిక దేహమున కగ్ని సంస్కార మొనర్పబడెను.

మహత్తర సౌధములు కాలగర్భమున మాయమగును. మహోత్కృష్ట చరిత్రలు మాయవు.

# తత్త్వవేత్త - శ్రీ రాధాకృష్ణ

## రాధాకృష్ణ - బాల్యము

శ్రీ ప్రకాశము ముఖ్యమంత్రిత్వముచే వెలుగొందుచున్న యాంధ్రరాష్ట్రము నమ్మృతమూర్తియు తత్త్వవేత్తయు నగు రాధాకృష్ణుని యాశీర్వాద బలముచేఁ బెంపొందుచున్నది. కావున మనము రాధాకృష్ణచరిత్ర తెలిసికొందము.

శ్రీ రాధాకృష్ణుని జన్మస్థానము తిరుత్తని. చిత్తూరు జిల్లాలోఁగల పుణ్యక్షేత్రములలోఁ దిరుత్తని కూడ ముఖ్యమైనది. రాధాకృష్ణునియింటిపేరు సర్వేపల్లివారు. రాధాకృష్ణ పుట్టుకచే ధనికవర్గమునకుఁ జేరినవాఁడు కాఁడు.

క్రీ. శ. 1888 సెప్టెంబరు 5వ తేదీన రాధాకృష్ణ జన్మించెను. 1952 సెప్టెంబరు 5వ తేదీకి సర్వశాస్త్ర పరిపూర్ణుఁడైన డాక్టర్ సర్. యస్. రాధాకృష్ణునకు అరువది నాలుగేండ్లు నిండినవి.

రాధాకృష్ణుని బాల్యదశ యంతయు జన్మస్థానమునందును తిరుపతి పుణ్యక్షేత్రమందును గడచినది. తర్క-వేదాంత పండితప్రకాండు లున్న పుణ్యక్షేత్రములందు శైశవ క్రీడలు నెఱపిన రాధాకృష్ణకుఁ దర్క-వేదాంతసారములు వెన్నతోడనే పెట్టఁబడినవి.

బంగరుసలాకవంటి మేను, దబ్బపండువంటి ఛాయ, కోలముక్కు, తెలిగన్నులు, మందస్మితము, మితభాషిత్వము, ఏకసంథాగ్రాహిత్వము, ఋజువర్తనము, సరళస్వభావము, గ్రహణశక్తి, నిదానము, నెమ్మది, జిజ్ఞాస, వినయము, విధేయత మున్నగు గుణములన్నియుఁగలిసి పుంభావసరస్వతియైన రాధాకృష్ణుఁడై యవతరించెను.

## రాధాకృష్ణుని విద్యాభ్యాసము

ప్రాథమికవిద్య పూర్తి కాగానే రాధాకృష్ణుఁడు క్రైస్తవమిషనరీల 'హైస్కూళ్ళ' యందును, కళాశాల యందును జదివి 'యమ్. ఏ.' పరీక్షయందుఁ బ్రథమశ్రేణిలో నుత్తీర్ణుఁ డయ్యెను.

ఓ న మ లు ప్రారంభించినది మొదలుకొని యం. ఏ. పరీక్షయం దుత్తీర్ణుఁ డగువఱకు నతఁ డే 'క్లాసు' లోను అపజయము గాంచలేదు. సరేకదా ప్రథమశ్రేణిలో విజయపరంపర లొందినాఁడు. అన్ని పరీక్షలయందును నతని దే పై చేయి. విశ్వకళాపరిషత్తుల యందలి స్వర్ణపతకములన్నియు నతఁడే గుత్తగొనినాఁడు.

అతఁడు చదివిన బడులలోను, కళాశాలలలోను ఆనాడు మతబోధ విరివిగా సాగుచుండెను. తత్ఫలితముగా నతనికి మతతత్త్వ జిజ్ఞాసలో నుల్లము ప్రఫుల్లమైనది. హైందవమతమును గూర్చి మిషనరీల దొరలు చేయు తప్పుడు విమర్శ లెంతవఱకు సత్యములోఁ దెలిసికొనవలయునను తీవ్రకాంక్ష యానాఁడే రాధాకృష్ణ పండితునకుఁ గలిగినది. ఆ జిజ్ఞాసతో నతఁడు

1908 వ సంవత్సరములో యం. ఏ. పట్టపరీక్షకై యొక మహోత్కృష్ట వేదాంత గ్రంథమును వ్రాసెను.

ఆ గ్రంథమును గాంచి క్రైస్తవ కళాశాల ప్రొఫెసర్ ఎ. జి. హాగ్ తాత్త్వికసమస్యల పరిష్కారములో 'విశిష్టమేధ' యిందగపడుచున్నదని ప్రశంసించెను. తాను యం. ఏ. పరీక్ష యందు నుత్తీర్ణుఁడు కాఁగానె యం. ఏ. చదువు విద్యార్థులు చదువఁదగిన వేదాంతగ్రంథమునువ్రాసి యాంగ్లేయాచార్యుల మన్ననలఁగన్న రాధాకృష్ణుని బుద్ధి విశేషమెన్నఁదగినది.

## రాధాకృష్ణుని ఆచార్యత్వము, వక్తృత్వము

1909 సంవత్సరము ఏప్రియల్ నెలలోఁ దొలుదొల్త రాధాకృష్ణుఁడు మదరాసు రాజధానీకళాశాలలోఁ దత్త్వశాస్త్రాచార్యుఁడుగాఁ బ్రవేశించెను. నాఁటికే యాతఁడు వేదాంతగ్రంథకర్త, ఆచార్యస్తుతిపాత్రుఁడుకాఁగలిగెను. ఆనాఁడతఁడు తన యఖండ తత్త్వశాస్త్ర పాండిత్యమున కెంతయో మురిసిపోయెను. నేఁడు రాధాకృష్ణుఁడు తర్కశాస్త్రప్రగల్భతా ప్రదర్శనమునకై తాను పడిన తాపత్రయమునకు సిగ్గుపడుచుండెను. కారణమేమన : మనఃపరిపాకమే వయసుతోపాటు విజ్ఞత పరిణతి చెందుచుండెను. దానితో సమాజవేదాంతియైన రాధాకృష్ణుని మానసికతత్త్వమే మాఱిపోయెను. అతఁడు నేఁడు విశ్వకుటుంబి వసుధైక ప్రభుత్వాకాంక్షి, శాంతిదూత. ఆచార్యత్వము వహించిన యాతని యుపన్యాసములు అమృతవాహినుల యనర్గళధారలు.

మదరాసు రాజధానీ కళాశాలలో నేమి, కలకత్తా విశ్వవిద్యాలయమునందేమి, (1925) మైసూరు విశ్వవిద్యాలయము

నందేమి (1931-36) యాతఁడగపఱచిన బోధనాశక్తి యపూర్వమైనది.

తెల్లనితలపాగా, తెల్లనికోటు, తెల్లనిచొక్కా. తెల్లని పంచెకట్టు గలిగి చిఱునగవు మోమునఁ జిందులాడుచుండ రాధాకృష్ణుఁ డాచార్యపీఠము నధిష్ఠించి విశ్వరూపవిలసితము, వాణీమందిరమునైన తన నోరువిప్పి భారతీయ వేదాంతమును గూర్చియు, పాశ్చాత్య వేదాంతమును గూర్చియు శంకర, రామానుజ, మధ్వ, వల్లభాచార్యులగూర్చియు కేంట్, లీబ్నిజ్‌లను గూర్చియు నుపన్యసించుచుండఁగా విద్యార్థులు స్వర్గసీమలలో విహరించుచుండువారు. శరవేగముగల యీ యుపన్యాసములు శ్రోతల హృదయముల నాకర్షించుశైలియు భావబంధురతయు గలిగి చక్కిలిగింతలు పెట్టెడివి. పనికిమాలిన పదప్రయోగములుగాని, కొఱకరాని కొయ్యమాటలుగాని యీ యుపన్యాసములలో నుండెడివి కావు. ప్రతిమాటలోను రాధాకృష్ణుని ప్రతిభ ప్రతిఫలించెడిది. నిండుదనము ప్రకాశించెడిది. మేధావియగు నాతని హృదయము ఆవేశమును బైకిఁ దోఁపనీయదు. పదప్రయోగమునకుఁ దగిన భావము, భావప్రదర్శనమునకుఁ దగిన పదప్రయోగము చేయుట యాతని సొమ్ము.

ఏపాశ్చాత్య విశ్వకళాపరిషత్తునందును నియ్యభ్యాసము చేయకయే యింత యఖండ ప్రతిభను బ్రదర్శించు నాయద్వైత మూర్తిని ఎవరైన "మీరు పాశ్చాత్యదేశములలో నేల సంచరింపరాదు?' అని ప్రశ్నించినేని "శంకరరామానుజ మధ్వవల్లభాచార్యులేవిదేశముల కేగిరి? వారిప్రతిభ దిగ్దిగంతముల వ్యాపించలేదా?" యని యెదురుప్రశ్న వేసెడివాఁడఁట.

కలకత్తా విశ్వకళాపరిషత్తులో నున్నపుడు, నిజమే వైదేశిక పండితులు తనకాళ్ళమీదఁబడి తమతమ విశ్వవిద్యాలయము లకు వచ్చి భారతీయ వేదాంతసారమును వినిచి తమ్ము తరింపఁ జేయుమని ప్రార్థించుదాఁక నతఁడు విదేశములకు వెడలలేదు.

రాధాకృష్ణుని రూపమునందువలెనే వాక్కునందును సౌందర్యము, శీతలత, మాధుర్యము తొణికిసలాడుచుండును. 'నా సృష్టిఃకవిః' అను వాక్యమితనికే చెల్లును. కవి వేదాంతి, ఋషికూడ నగును. కావుననే యాతనిప్రతివాక్యము రసభావ విలసితమైన కవిత్వము. 'వాక్యం రసాత్మకం కావ్యమ్' అనునది రాధాకృష్ణుని యెడ 'నక్షరాల' సార్థకము. అసాధ్యములు దురవగాహములు నైన శాస్త్రవిషయములను అరఁటిపండు ఒలిచి చేతిలోఁబెట్టినట్లు తెలుపుశక్తి రాధాకృష్ణుని వక్తృత్వ ములోఁ గలదు. వంగదేశపండితు లీతని భగవద్గీతోపన్యాస ములపై వేసిన యడ్డుగడ్డుప్రశ్నముల కీతఁడొసఁగిన సమాధాన ములకు వారు దాసోహమ్మని పాదాక్రాంతులైరి. రాధాకృష్ణుఁ డే విషయమునుగూర్చి యుపన్యసించినను బోధకుఁడుగానే యుపన్యసించును గాని పాండిత్యప్రకర్ష ప్రదర్శింపఁడు. తన వాక్కులెంత సరళములో అంత గంభీరములు. ఒక్క వాక్య ములోఁ జెప్పవలెనన్న అతని వాక్యరచన భగవద్గీతావాక్య రచనవంటిది. వ్యాఖ్యాత హృదయమునుబట్టి యర్థములు భావ ములు ఉత్పన్నములగుచునే యుండును. ఇది యతని బోధనా శక్తిలో విశిష్టతను జాటుచుండును. శ్రీకృష్ణుని వేణుగాన రవము గోపికలనువలె రాధాకృష్ణుని యుపన్యాస మాధురి శిరీషకుసుమ పేశలమై (దిరిసెనపూవువలె మెత్తనై) విధి, విరామములేక సెలయేటిధారవలె అనర్గళమై, పింఛము విప్పి

యాడు నెమలివలె నృత్యముచేయుచు వినువారి మనస్సుల నలరించి యానందతరంగములపైని రాయంచలవలె నూఁగులాడించును. వేయేల, ఆ మధురమూర్తియుపన్యాసము సంగీతమువలె ప్రమోదములఁజిగిరింపఁజేయును. రాళ్ళనుగరఁగించును. చేతనాచేతనములచేఁ దలలూఁపించును. పండిత పామరరంజకమై యుండును.

రాధాకృష్ణుఁడు ఆంధ్రకళాపరిషదుపాధ్యక్షుఁడు

రాధాకృష్ణుఁడు మద్రాసు, మైసూరు, కలకత్తా విశ్వవిద్యాలయములలో తత్త్వశాస్త్రాచార్యుఁడై ప్రాక్పశ్చిమ దేశాల వేదాంతశాస్త్రములందలి సకల సారాంశములను నాయా మండలములందలి విద్యార్థిలోకమున కందఁజేసి వారిని పునీతులను జేయుటయేగాక స్వదేశ విదేశ వేదాంతుల మన్ననలను గన్న విన్నాణి. కలకత్తా విశ్వవిద్యాలయమునం దాచార్యుఁడుగా నున్నపుడె యీతని విశ్వవిఖ్యాతిని గాలించి లక్నో విశ్వవిద్యాలయమువారు తమ విశ్వకళాపరిష దుపాధ్యక్ష పదవి నలంకరింపవలసినదిగా నర్థించిరి. రాధాకృష్ణుఁడంగీకరింపలేదు. అంతలో ఆంధ్రులు తమ విశ్వకళాపరిషత్తున కుపాధ్యక్షుఁడుగా రమ్మని ప్రార్థించిరి. పరదేశములం దెన్ని మన్ననలు గన్నను గన్న దేశముకన్నవవి మిన్నలుకావనియెఱింగిన రాధాకృష్ణుఁడు వెంటనే తన యంగీకారమును దెలియఁజేసి 1931 లో ఆంధ్ర విశ్వకళాపరిష దుపాధ్యక్షుఁడై యున్నతాదర్శములతో 1936 వఱకు నా పదవిని నిర్వహించెను.

ఆర్థికముగా గుంటపూలు పూయుచున్న యాంధ్రవిశ్వకళాపరిషత్తునభివృద్ధికై యాతఁడు విశ్వదాత, కళాప్రపూర్ణుఁడు జయపుర సంస్థానాధిపతియైన శ్రీ విక్రమదేవ వర్మగారిని దర్శించి

విద్యాపక్షపాతియగు నా వదాన్య శేఖరునిచేఁ దన విశ్వకళాపరిషత్తునకు నేఁటేట లక్షరూపాయలు 'విరాళమిచ్చునట్లుచేసి, శ్రీ విక్రమ దేవవర్మగారిచే వారి పేరిట టెక్నలాజికల్ కాలేజి భవనములు కట్టింపఁ జేసెను. ఆంధ్రవిశ్వకళాపరిషత్తునకు ఆఱు లక్షలరూపాయలవ్యయముతోఁగట్టఁబడిన యాదివ్యసౌధములే నాఁటికి నేఁటికి నేనాఁటికి మాయని యలంకారములై యున్నవి.

ఉపాధ్యాయుఁడైన రాధాకృష్ణుఁడు కేవలము కార్యాలయ కార్యకలాపములుమాత్రమే నెరవేర్చుచుఁ బ్రొద్దులు పుచ్చక తన మేధాసంపత్తిని విద్యార్థిలోకమునకుఁ బంచి యిచ్చుచు నమూల్యోపన్యాసము లొసంగుచుండెడివాఁడు.

అతఁడజాతశత్రువు. ఎవరి యెడను నెన్నఁడును ద్వేషభావము గనుపఱుపనివాఁడు గావున విద్యార్థు లాతని కడకుఁ జనవుగా వచ్చి తమ కష్టనిష్ఠురములను దెలుపుకొనుట యేగాక శాస్త్రవిషయకములైన తమ ధర్మసందేహములనుగూడఁ దీర్చుకొనుచుండెడివారు.

పరేంగితావగాహియైన యాతని కడ నెంత చనువున్న విద్యార్థియైనను నెవరిమీఁదను 'చాడీలు' చెప్పుటకు సాహసించువాఁడు కాఁడు.

చిన్ననాఁటఁ బేదఱికము రూపురేఖ లెఱిఁగి యిడుమలు పడినవాఁడుగావునఁ బేదవిద్యార్థులయెడ నపారకరుణకలిగి వారి 'సాధక బాధకము'లను సానుభూతితోఁ బరికించువాఁడు.

ప్రపంచ విశ్వవిద్యాలయముల యాదర్శములన్నియు నాకళించుకొని యున్నవాఁడగుటచే రాధాకృష్ణుఁడు ఆంధ్ర

విశ్వకళాపరిషత్తు నత్యున్నతస్థితికిఁ దెచ్చుటకై యహోరాత్రములు పాటుపడెను.

ఆంధ్రులలోఁగల యనైక్యభావమును దొలగింపఁ దన శక్తిని ధారపోసెను. రాయలసీమవాసులకు సర్వాంధ్రులకు నెట్టియరపొరలు లేవని ఋజువుచేసెను. విశ్వకవి రవీంద్రనాథ ఠాగూరు, విశ్వవిజ్ఞానవేత్త రామన ప్రభృతుల నాహ్వానించి విశ్వకళాపరిషత్తునకు సేవచేయించి సేవ చేకూర్చెను.

తానింత గొప్పవాఁడనని విఱ్ఱవీఁగుచు నెన్నఁడు రాధాకృష్ణుఁడు చెట్టెక్కి కూర్చుండలేదు. అందఱకు నందుఁబాటులో నుండుచు నందఱి కష్టసుఖములలోను బాలుగొనుచుండెను. తన యింటనే పెక్కుమంది పేదవిద్యార్థుల కాశ్రయమిచ్చి జీతనాతముల తానే యొసంగి యున్నత విద్యలు చెప్పించెను. ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షుఁడుగా నేమి కాశీవిశ్వవిద్యాలయోపాధ్యక్షుఁడుగా నేమి యాతఁడుచేసిన యనంత దేశసేవ, భాషాసేవ సాటిలేనిది. మాలవ్యా గౌరవమునకుఁ బ్రశంసలకుఁ బాత్రుఁడై మహావేదాంతియై తాత్త్వికుఁడుగాఁ బ్రపంచ వాఙ్మయములో నగ్రస్థానము సంపాదించుకొనిన మహామనీషియైన రాధాకృష్ణుఁడు 'ఆక్‌ఫర్డ్సు' యూనివర్సిటీలో ఆజీవిత గౌరవాచార్యుఁడై 'డాక్టర్' బిరుదమునంది భారత దేశ గౌరవమును ఇనుమడింపఁచేసిన పుణ్యాధనుఁడు. ధన్యజీవి. యావద్భారత దేశ విశ్వవిద్యాలయములయందేమి పాశ్చాత్య విశ్వవిద్యాలయములయందేమి యాతఁడొసంగిన స్నాతకోపన్యాసము లసంఖ్యాకములు. ఆ మహామహుని ప్రతి యుపన్యాసమునందు నొక విశిష్టత, విశ్వసౌభ్రాత్రము, విశ్వకళ్యాణము, విశ్వశాంతి ప్రస్ఫుటించుచుండును. 'ఆక్స్‌ఫర్డ్'లో

రాధాకృష్ణుండాచార్యుండైనది మొదలుకొని నేఁటివఱకు నాతని నచ్చట నే స్థిరనివాస మేర్పరచుకోవలసినదిగా ఆంగ్లేయు లర్థించుచునే యున్నారు. ఇటలీ నియంతయైన ముసోలిని మొదలు అమెరికా అధ్యక్షుఁడు వఱకు రాధాకృష్ణుని తమ తమ ఖండముల కాహ్వానించి యాతని సుధామధుర తత్త్వ బోధముల నాలించి తనిసినారు.

తెలుఁగు గడ్డపైఁబుట్టి, ఆంధ్రద్రావిడభూములలో విద్య నేర్చి, ఆంధ్ర వంగ వారణాసీ పుణ్యభూముల విద్యా సంస్థల కధినేతయై పాశ్చాత్యదేశీయులకుఁ బరమగురువై భాసిలు చున్న మహాజ్ఞానియగు రాధాకృష్ణుఁడు కేవల విద్యావ్యాసంగ ముల తోడనే ప్రొద్దులు పుచ్చక శాంతిప్రియుఁడై శాంతి కాముఁడై గాంధి తత్త్వమును దనలో జీర్ణించుకొని తన దైనిక జీవితమును నేఁటికి నట్లు నడుపుచున్న ఋషిపుంగవుఁడు.

## రాధాకృష్ణుఁడు - దైనిక జీవితము

రాధాకృష్ణుఁడు ప్రతిదినము బ్రాహ్మీముహూర్తము నందే మేలుకొనును. ఇంటిల్లిపాది లేపును. అందఱు గలిసి యొకచోఁ గూర్చుందురు. గాంధి భజనగీతములను, రవీంద్రుని గీతాంజలిని భగవద్గీతను దాను పఠించి యందఱిచేతను బఠింపఁ జేయును. భాగవతములోని 'భ్రమరగీతము'లను దన్మయుఁడై ముక్తకంఠముతో గానముచేయును. తాను, తన పిల్లలు, మనుమలు గలిసి యా మధురగానమున లీనమై కొండొకసేపు నృత్యము చేయుచుందురు.

పూజాపురస్కారములందును వ్రతములందును దన బిడ్డ లకుఁ దానే పురోహితుఁడై రాధాకృష్ణుఁడు ఆకార్యకలాపము నిర్వర్తించుచుండును.

చిన్నప్పటినుండియుఁ దనతోఁ 'చెట్టాపట్టా'లు పట్టిన 'పద్మ'యె రాధాకృష్ణునికి ఇల్లాలుకావుటచే నతఁ డల్లాలితా కారకు సర్వవిధముల గృహకృత్యములయందుఁ దోడుపడు చుండును.

రాధాకృష్ణుఁడు ఇంట నేమి బయట నేమి గొప్పవాఁడనని బిఱ్ఱబిగిసి మడికట్టుకొని కూర్చుండఁడు. అందఱకుఁ దలలో నాలుకయై పూసలలో దారమై మెలఁగుచుండును. "నేను రాజ్యము కోరను, స్వర్గముకోరను, పునర్జన్మము కోరను. దుఃఖతప్తులైన ప్రాణుల యార్తిని మాత్రమే పోఁగొట్టఁగోరు దును" అను గాంధిమహాత్ముని ప్రియతమ గీతమును దన కంకి తము చేసికొనెను.

ఒకప్పుడు విశాఖపట్టణమునందలి కింగ్ జార్జి ఆస్పత్రిలో నొక పేదవాఁడు చనిపోయెను. వానికి మిగిలియున్న యాస్తి భార్యయొక్కతె మాత్రమే. ఆ యభాగ్యురాలు దిక్కులేక యుడు మొఱాలించినాడు. "విహ్వలనాగేంద్రము పాహి పాహి యన కుయ్యాలించి సంరంభియై' చను కృష్ణునివలె నచ్చటికిఁ జనినాఁడు. ఆనాఁడు గజేంద్రునిగావనేఁగిననాఁడు శ్రీకృష్ణుఁడు 'సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడు, ఏ పరివారంబును జీరఁడు—అభ్రగపతింబన్నింపఁడు'. ఈనాఁడు రాధాకృష్ణుం డట్లుగాదు. పద్మను గూడఁ దీసికొని బయలు దేరినాఁడు. డ్రైవరును బిలిచినాఁడు. సరాలున ఆస్పత్రిలో వ్రాలినాఁడు. ఆదీనురాలి మొఱాలకించినాఁడు, ప్రేతసంస్కా రము చేయించినాఁడు. ఆ యనాథను కారుపై నెక్కించుకొని యాదరించి, యామె చుట్టాలను రావించి, భయము లేదని

యోదార్చి కొంత ధనమిచ్చి పంపించినాఁడు. ఎంత దయా హృదయము !

మరొకప్పుడు రాధాకృష్ణుఁడు రైలులోఁ బ్రయాణము చేయుచుండఁగా రైలు కలకత్తా స్టేషన్ చేరినది. ఆ స్టేషనులో 'హారిస్' అను నాంగ్లేయుఁ డొకఁడు చచ్చిపడియుండెను. ఆ శవమునుజేరి వాని జేబులోనున్న చీటిని జూచి విచారించి యాతని మరణవార్తను ఆంగ్లదేశములోని వాని బంధువులకు 'కేబుల్' మూలమునఁ దెలియఁజేసి కలకత్తాలోని క్రైస్తవ శ్మశానమునం దాతనికి ఖనన సంస్కారము చేయించి వాని స్మృతిచిహ్నముగా నొక సమాధినిగూడ నిర్మింపఁజేసెను. ఎంత విశ్వమానవసౌభ్రాత్రము గలదో రాధాకృష్ణుని విశాల హృదయములో !

## నేఁటి రాధాకృష్ణుఁడు

రాధాకృష్ణుఁడు సర్వదా నెహ్రూ అంతరాత్మ నెఱిఁగి తదనుకూలముగా నడచుచుండును. ఆసియాయందును, ఇతర పాశ్చాత్యదేశములందును రాధాకృష్ణుఁడు నేఁడు విశిష్ట స్థానమును గడించుకొనినాఁడు.

దేశదేశాంతరములయందు ప్రకాశవంతమైన సూర్య తేజస్సునందు రాధాకృష్ణుఁ డొక పర్వతశిఖరమై నేఁడు వెలుఁగొందుచున్నాఁడు.

'మహోన్నతాదర్శములుగల వ్యక్తి సాధారణముగా సంఘమున నిరుపయోగము' అని కాంపర్డ్ చెప్పియున్నాఁడు. కాని యీ మాటలు రాధాకృష్ణుని విషయమున నసత్యములు. రాధాకృష్ణుఁడు తన మహోన్నతాదర్శములతో విభిన్నజాతులు గల మన సంఘమున కెంతయో యవసరము.

ఇదే విధముగా అమెరికా రష్యాలయందును, అంత
ర్జాతీయసమావేశములందును, మహిళాసభలందును, వేదాంత
సమావేశములందును, సంగీత సభలయందును పట్టప్రధాన
మహోత్సవములయందును ఇది యది యననేల? ఎల్లవాటి
యందు రాధాకృష్ణునకు ప్రత్యేక స్థానమున్నది.

అతఁడు స్వపక్షమును బరపక్షమును గొనియాడుటకు,
మందలించుటకుఁ గూడ సమర్థుఁడు. రాధాకృష్ణునికి స్వార్థ
మన్నదిలేదు. ఇతరుల మెప్పుపొందుటకై వారి చెప్పుచేఁత
లలో నడఁచికొనదగిన యవసర మంతకుమున్నె లేదు.

అందఱివలెఁగాక యతఁడు వనితలనడుమ నిలిచి వారి
గృహనిర్వహణమును గూర్చి పెద్దపెద్ద సమావేశములలో
ముచ్చటగా ముచ్చటింపఁగలఁడు.

రాధాకృష్ణుని మన పార్లమెంటులోని రెండు సభల
వారును ఎన్నికలయందు ఉపాధ్యక్షునిగా నెన్నుకొన్నారు.
ఎన్నుకొనక పూర్వమును, పిమ్మటను గూడ భారతజాతి
యంతయు నాతని కుటుంబమేయని చెప్పవచ్చును. రాధా
కృష్ణుఁడు రాజకీయవేత్తలయందు రాజకీయవేత్త. నియంతల
యందు నియంత, వేదాంతులలో వేదాంతి, మానవులలో
మానవుఁడు. అతఁడు మన దేశపు ఉపాధ్యక్షపదవి నలంకరించి
దానికి పేరుప్రతిష్ఠలు తెచ్చి దాని నున్నతస్థాయిలోనికిఁ
దీసికొనిపోయెను. స్వదేశవిదేశములలో మహారాజ్యాల జీవిత
విధానమును బ్రదర్శించిన రాధాకృష్ణుఁడు మన యుపాధ్యక్షుఁ
డగుట మన యదృష్టము. రష్యారాయబారిగా నతఁడు ప్రద
ర్శించిన దాత్యభావము స్టాలినంతటివానినే తన దర్శనభాగ్య
మభిలషించునట్లు చేసినది.

రాధాకృష్ణుఁడు ఆకృతియందువలె హృదయమందుఁ గూడఁ గడుఁబెద్ద. కావుననే నెహ్రూపండితుఁడు నేఁటి ప్రపంచ విషమపరిస్థితిని, నిశ్చలసంగ్రామమును దొలగించి విశ్వమానవ కళ్యాణమును జేకూర్చుటకై రాధాకృష్ణుని శాంతిదూతగాఁ బ్రశంసించినాఁడు.

నేఁడు మన భారతదేశోపాధ్యక్షుఁడు ప్రపంచశాంతి పరమధ్యేయమని, వివిధదేశములమధ్య సహకారసౌహార్దములను బెంపొందించుటకై ప్రపంచయాత్ర గావించుచున్నాఁడు.

## రాధాకృష్ణుని సూక్తులు

"పేదతనము, బాధలు స్వయముగా ఆహ్వానించుకొనినప్పుడే మానవునకు ధీరోదాత్తతను జేకూర్చును. అంతేకాని దారిద్ర్యము కళాకారునకుఁ జక్కని ప్రోత్సాహకరమని చెప్పు చప్పిడిమాటలు కేవలము బూటకములు. అట్లనువారు స్వయముగా ఆ బాధయేమిటో గుండెలలో గ్రుచ్చుకొనినవారే".

తత్త్వవిచారమునకు దిగుటకు మానవునకు జీవితావసరములు తీరవలెను. అప్పుడే యతఁడు స్వతంత్రభావ విలసితమైన యాలోచనకుఁ బూనుకొనఁగలఁడు. "మన న్యాయశాస్త్రములు, ధర్మవ్యవస్థలు, కార్మికులకుఁ బ్రాఁతకాలపు బానిసలకు వేసినంత దృఢతర శృంఖలాలను దగిలించుచున్నవి. బలవంతుల హక్కులేవో, ధనవంతుల హక్కులేవో, ఖండితముగా సున్నితముగా నిర్వహించుచున్నవి. కాని దుర్బలుల దంద్రుల హక్కుల నవి మఱచిపోవుచున్నవి."

"సుఖసంపత్తిని సువర్ణస్వప్నములను నులిమి వేయుటలో ప్రావీణ్యము చూపుచున్న సమాజ వ్యవస్థల గోడుల నడుమ,

'బందీ'గానున్న మానవహృదయము యమయాతన పడు చున్నది.

"భయపిశాచమునుండి విముక్తియనున దెన్నటికి? యుద్ధానంతర భయము విపరీతముగాఁ బ్రబలిపోయినది. ఆకలి కాటకముఁగూడ విపరీతముగాఁ బెఱిఁగిపోయినవి." "కడచిన మహాయుద్ధములో మనము లక్షలాది యువకుల నిండుప్రాణ ములు బలిపెట్టినాము. అయినను మన గమ్యస్థానము నింకను మనము చేరలేదు. ఈసమస్యలు పరిష్కరించుటలోనాలస్యము చేయుట శ్రేయోదాయకము కాదు."

అని రాధాకృష్ణుఁడు విశ్వకల్యాణము, విశ్వశాంతి, విశ్వజన సౌఖ్యముగోరుచు వచించెను. బహుళగ్రంథకర్తయు, స్ఫురద్రూపియు, ఉత్తమవక్తయు, తత్త్వవేత్తయు-మానవతా ప్రపూర్ణుఁడు-నైన రాధాకృష్ణుని పుత్రునిగాగన్న యాంధ్ర మాత ధన్యురాలు.

అమరజీవి, ఆంధ్రకేసరి, తత్త్వవేత్తయను ముగ్గురు మన యాంధ్రులపాలిటి యమరమూర్తులు. ఇట్టి మహాపురుషులఁ గన్న యాంధ్రమాత ధన్య.